క. "ఆడుది గోరిన గాడిద వాఁడే కోరినను మొగలివంటిది ' యనుచున్
జేగొలు సెప్పెడి సామెత నేఁడే మీవలన నాకు నిక్కంబాయెన్. ౩౮

క. వెలఁది తనంతటఁ దానై చులుకఁదనమ్మునకు మనసుఁ జొన్పుచు సిగ్గున్
వెలితి యొనర్చుటకన్నను గలదే మఱి తప్పిదంబు ? కవికులవర్యా ! ౩౯

క. రసికుఁడవని నిను గోరిన రసహీనముఁ జేసి యిట్లరయకయె నన్నున్
గసరుట ధర్మంబగునే రసికులు వినిరేని నవ్వరా, రసికవరా ! ౪౦

ఉ. మూలములేని టీక సుమపుంజసమృద్ధముగాని శయ్య వా
చాలతలేని పాండితియు సంతతిలేని గృహంబు మంచితాం
బూలములేని భోజనము ముద్దులు గుల్కెడి కన్నెమిన్నతో
మేళనలేని జవ్వనము మేలగునే ? కవిరాజశేఖరా. ౪౧

ఉ. ' సుకవి యితండు నియ్యదియు సుందరి వీరల కెంతమాత్రమున్
రకముగనున్న ' దంచు ' ఘటనానిపుణత్వ మయారె ! ' యంచుఁ బెం
డ్లికిఁ జనుదెంచినట్టి ఘనులే వచియింపఁగ వింటి; నన్ గ్రహిం
పకునికినైనఁ దప్ప దిది, వచ్చిన వాదులు తప్పిపోవునే ? ౪౨

క. మన కిదివఱకే కలదని జను లెల్లరుఁ జెప్పికొనఁగ సాఁగిరి కాదే !
' జనవాక్యం కర్తవ్యం ' బను పెద్దలపల్కులకును నాఁడి కలదే ? ౪౩

తే. గీ. ఏలయీలాటిమాటలు ? చాలుఁజాలు,
' హితవుగా ' దని చెప్పరాదే, మహాత్మ !
' ఆలి నొల్లనివానికి నీలకూర
లోన నుప్పెక్కు ' డను మాటలు నిజమాయె, ౪౪

క. వెడవిల్తుఁడు శరములబారిడి ననుఁ గుడి యెడమ లేక యేయుఁ దొడంగెన్
గడెయైనఁ దాళఁజాలను దడ వొనరించుటిది మంచితనమా ? ఘనమా ? ౪౫

ఉ. వాదములేల ! పట్టి యపవాద వహింపఁగరాదు గాన మీ
పాదములాన యింక వలవంతలఁ బెట్టుటగాదు, చిత్తదా
యాదుఁడనైతి శంక వల " దంచుఁ గరగ్రహణంబొనర్చె నా
గాదిలిసన్నెలాఁడి ; భువిఁ గాంతలసాహస మింతయొప్పునే ! ౪౬

ఉ. గుట్టుచెడెన్, దడాబిడిగ గుండెలు జల్లనె, మైచెమర్చె, ని
ట్టట్టు పడంకె హస్తములు, నన్యముఁ జెప్పఁటకోపఁడాయె, సా

పట్టున నా శుకుండయినఁ బల్కఁగలాఁడె మఱొక్కమాట! లేఁ
డట్టి జితేంద్రియుండు ప్రవరాఖ్యుఁడుదక్క మఱొక్కఁ డెక్కడన్. ౪౭

ఆ.వె. అట్లు కరముపట్టి యాలింగన మొనర్ప
నిచ్చఁజేయు నంత నేగుదెంచి
రా సరోజనేత్రి యనుఁగు నెచ్చెలు; లతం
డానిమిత్త మెంచి యవలఁ ద్రోచె. ౪౮

ఉ. ద్రోచిన వెన్కఁ జూచి, తనతోడిచెలుల్ పఱతెంచుటం గదా!
యీ చెలికాఁడు సిగ్గు పడియెం; జెలు లిప్పుడు నాదు పాటికిన్
బూచులవంటి వారయిరి పో! యని చింతిలసాఁగె; స్నేహముల్
దోఁచవుగా మనం బతనుదోషపరీకృతమైన వేళలన్. ౪౯

వ. అట్టియెడ దగ్గరి నెచ్చెలు లిట్లనిరి. ౫౦

సీ. "పరిహాసమునకు నే 'బావగా' రనిపిల్వఁ 'బొమ్మ'న్నవారు కాఁబోలు వీరు!
వారుగారేవీరు చేరి నే 'మఱదిగా' రని పిల్వఁ గసరుకొన్నట్టివారు!
వారు గారే వీరు వలపార మనకాంత దరిఁజేర వెన్కకు జరగువారు!
వారుగారే వీరుఁ 'వారకాంతలు మాకుఁ బనికి రా' రని ప్రజ్ఞఁబలుకువారు!

తే. గీ. వారలునుగారు వీరలెవ్వారొ గాని,
వారలేరైన నీలాటి పనులొనర్తు
రే!" యటంచును నాయమ్మ లెత్తిపొడిచి
గేలిగావించి రమ్ముద్దరాలి చెలులు.

తే. గీ. ఇటులు పల్కెడి కాంతల కుటిలవచన
ములను వినియును విననియ ట్లోలయఁజేసి
రయము మీఱంగఁ జనెఁ గవిప్రవరుఁ డంతఁ
దన మనమునందు సందేహ మినుమడింప.

సీ. బ్రహ్మదేవు మొగమ్ము పడఁతికిఁ బడకిల్లు చేసి పెట్టినయట్టి చేవకాఁడు
హరియురస్థల మొక్కయంగనామణికి హర్మ్యతలమ్ముగఁ జేసినట్టి ఘనుఁడు
సాంబుశరీరంబు నంబుజాక్షికి ధారవోయింపఁ జేసిన మాయకాఁడు
"స్త్రీలఁజూడ"మటంచుఁ దెగనేల్గు పెద్ద పెద్దల గర్వముల గంగఁ గలుపువాఁడు

తే. గీ. తత్కరస్పర్శతన్మృదుతరవచశ్శ్ర
వణములను బీజమునఁ బునర్భవము నొంది
యంతలో వృద్ధిఁ జెంది కొండంతయగుచు
నాతనికిఁ ద్రోవలోనఁ బ్రత్యక్షమయ్యె. ౫౩

సీ. నడచునేకాని యానడచు మార్గం బేడ కేగునో యాతని కెఱుక లేదు
చూచునేకాని యాచూచు పదార్థమ్ము లెవ్వియో యాతని కెఱుక లేదు
తలఁచునేకాని యాతలఁపులో సంగతి యెద్దియో యాతని కెఱుక లేదు
నవ్వునేకాని యానవ్వు నవ్వుట కేమి హేతువో యాతని కెఱుక లేదు

తే. గీ. పలుకునేకాని పిలిచినవార లెవరొ
యెంతమాత్రము నాతని కెఱుక లేదు ;
ఏమి చెప్పుదు! నంతలో నింత యయ్యె
నాతని యవస్థ యా ఝషకేతు వలన. ౫౪

క. వివిధములగు సందియములు వివిధములగు కోరికలును వివిధగతులఁ ప్రక్
గవిసి కొలువంగ నాతఁడు భవనమ్మును జేరె జిల్లపడిన మనముతోన్. ౫౫

ఉ. చందురుఁ జూచి యుల్కిపడుఁ, జల్లనిగాలికి నెట్టఁజెందు, నే
చందము నందముం గనఁగ నైఁపఁడు, నిద్దురఁజెందనోపఁ డా
సుందరిచందమున్ మదిని జొన్పి యనార్యములైన కోరికల్
సందడిఁ జేయ మందుని పసందునఁ గుందుఁ గవీంద్రుఁ డెంతయున్. ౫౬

ఉ. "వేసవి మల్లెమొగ్గలకు వియ్యపురాలు రదాళి, నాసలో
వీసము గాదు గంధఫలి, వేల్పు మిటారుల తోడికోడ లా
రా! సఖి, దానిఁ బోల్పఁదగవా? యితరాంగనలన్, సెబాసు! బా
లాసతిఁ బోలఁగల్గు నవలా భువిలో నహి లేదు లే" దనున్. ౫౭

వ. అని పట్టరాని తమకమ్మున.

శా. వెన్నన్ జెంపలగొట్టు మైనునుపుతో, వింతైన కెమ్మోవితో,
సన్నల్ సేసెడి ముద్దుకన్నుఁగవతో, జాఱైన పయ్యంటతో,
గన్నేరుంబువు గాఁగరా సొబగుతోఁ గామించి దోతెంచు నిన్
గన్నారం గని ముచ్చటాడఁగల భాగ్యం బెన్నఁడో? కోమలీ. ౫౮

సీ. పలు కొక్కటియె సేయుఁ బదిపందల వరాలు వాలుఁజూపులు రెండువేలు సేయు
నగ వొక్కటియె సేయు నాల్గువేల వరాలు నిబ్బరీఁగుబ్బ లాఱువేలు సేయుఁ
బద మొక్కటియె సేయుఁ బదివేల వరహాలు లావణ్య మది యొకలక్ష సేయుఁ
బలుసోయగమె సేయుఁ బదిలక్షల వరాలు కులుకుగుబ్బలతీరు కోటి సేయు

తే.గీ. ముద్దుగులికెడి నెమ్మోము మూఁడుకోట్లు
నాసనాబ గెన్న డెబ్బదినాల్గుకోట్లు
నుదుటి సింధూరనామమ్ము నూఱుకోట్లు
నీకు వెలఁజెప్ప శక్యమే? నీలవేణి. ౭౦

సీ.*కలికిరో! మెత్తనై యలరు నీ మే నొక్కసారి గిల్లినఁ బాలు గారకున్నె!
యబలరో! మించులై యలరు నీచూపులు సోకినంతనె మది చొక్కకున్నె!
పొలఁతిరో! మృదులమై యలరునీ కెమ్మోవి నొక్కినంతనె తేనె చిక్కకున్నె!
చెలియరో! నీదుకౌఁగిలి యొక్కత్రుటియైనఁ బడసిన రస ముట్టి పడక యున్నె!

తే. గీ. ముగుద! నీతోడ నొకమాఱు మాటలాడ
సరసకవితావిశేషంబు మెఱయకున్నె?
ముదిత! యొకసారి నీకనుల్ ముద్దుగొనిన
బ్రహ్మకైవల్యపదవి చేఁబడక యున్నె? ౭౧

సీ. తడబాటుచేతఁ జే యొడిసి పట్టి 'కటాక్ష మ్ముంచుమా' యన నాలకించనైతిఁ
దుమ్మిన విచ్చు తుందుడుకు గుబ్బలఁ గౌఁగిలించఁ బూనిన సమ్మతించనైతిఁ
గలకండకన్న మిక్కటమైన రుచిగల్గు కెమ్మోవి రుచులారగించనైతి
వెడవింటివాఁడు ఱువ్విన బాణములఁ జాల వగలఁ బొందిన జాలిఁ దగులనైతిఁ

తే. గీ. బవలుచెయి పట్టి పిలిచినఁ బలుక కట్టి
చాన నమవస చీఁకటిలోన నీలి
చీరఁ గట్టినతటి సన్నఁజేయు నెట్టి
పగిది నేఁ గోలుపోతి దైవంబ! నేఁడు. ౭౨

చ. కనుఁగవ కింపు గల్గి తగు కామకలాభ్యసనంబు గల్గి యౌ
వనమున లేఁత యయ్యు రసభావములం గడుఁ బెద్దయై తనం
తన వలపున్నదైన వనితామణి యెవ్వనికబ్బుఁ? బాగ్యభవం
బునఁ దులలేని పుణ్యములు పూవులు పూచి ఫలింప కుండినన్‌. ౭౩

చ. జిలిబిలిపల్కులున్ సొగసుఁ జిల్కెడి ముద్దులుఁ దారుమారులున్
వలపులచోద్యముల్ మిగుల వన్నెలుఁ జిన్నెలుఁ గల్గుకౌఁగిలిం
తలు బ్రితిమాలుటల్ కసరి తప్పులువట్టుటలుం జెలంగుకాం
తలరతమే రతంబు ; మఱి తక్కినవెల్ల రసాతిదూరముల్. ౬౪

చ. వలచినలేమఁ గూడుటయె భాగ్యము, భార్యలవల్లఁ దత్సుఖం
బలవడ ; దన్యకాంత లనఁగా, మఱి తల్లులవంటివారు ; వే
శ్యలకిది సున్న ; యొక్కయెడ సంభవ మందిన నట్టివేశ్యతోఁ
గలయుటకన్న వేఱొకటి కల్గునె ? స్వర్గము మోక్షముల్ భువిన్. ౬౫

ఉ. తానఁట, వేశ్యకాంతయఁట ! తానయి తాఁ దనుగోరు నంట ! యెం
తేనియు ముద్దులాఁడి యఁట, యీడును జోడఁట ! మానియైనఁ దా
మానఁ గలాఁడె ? వేయి పయిమాటలు సెప్పఁగ నేర్చుఁగాని ; యే
మైనను దీనిఁ గూడవలదా ? యిలఁ దా జనియించి నందుకున్. ౬౬

సీ. కలుగనే కలుగదు కలిగ నేనియు ఛాందసున కనాథస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగ నేనియుఁ బండితునకుఁ బరస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగ నేనియును రాజునకు దాసస్త్రీగమనము గల్గఁ
గలుగనే కలుగదు కలిగ నేనియుఁ గవీంద్రునకుఁ బణ్యస్త్రీగమనము గల్గఁ

తే. గీ. గలుగ దొకవేళఁ గలిగినఁ గలుగు మునుల
కప్సరస్త్రీగమన మని యనుటవలనఁ
గవులకును వేశ్యలకుఁ దప్పుగాదు చెలిమి ;
దానిలో నప్రియత్నసిద్ధ మిదికాదె ! ౬౭

ఉ. కోరినదాని మాను టది గొప్పవిశేష, మిఁకట్టిపూరుషుం
డారయ లేఁడు నూటి కొకఁడైనను, గోటికి నొక్కరుండు చే
కూరునో, లేదో ? తా నగుచుఁ గోరెడి పూరుషుఁడన్న వెఱ్ఱివాఁ
డై రసహీనుఁడై జగమునం దపహాస్యతఁ గాంచకుండునే !

సీ. తనకుఁ దానై వండుకొని తిన్న నద్దియన్నంబు గాదద్ది సున్నంబు గాని
తనకుఁ దానై వేసికొనిన నయ్యది వీడియమ్ము గాదది వడియమ్ము గాని
తనకుఁ దానై పెట్టికొనిన నయ్యది మంచికొప్పు గా దది ప్రాఁతచెప్పు గాని
తనకుఁ దానై చెప్పికొనిన నయ్యది సుప్రతిష్ఠ గా దది యప్రతిష్ఠ గాని

తే. గీ. తనకుఁ దానయి పొంద రమ్మనుచుఁ గాంతఁ
గోరునది నోరుగాదు పైజారుగాని
యప్రయత్నసిద్ధమ్ముగ నబ్బినట్టి
పొందు లొడఁగూర్చుఁ గాదె పెంపొందు సుఖము! ౧౯

క. కవితయు వనితయుఁ దనయంత వలచి వచ్చిన ముదం బొదవఁ జేయును ; మ
క్కువ లేక బలాత్కారంపు విధమ్మున వచ్చినదియ పో! దుఃఖమిడున్. ౨౦

క. ధనకాంతామోహమ్ములు జనులకు స్వాభావికములు జగమున; నెవఁ డీ
ధనకాంతామోహమ్ములఁ గన కుండునొ వాని శివునిఁగా నెన్నఁ దగున్. ౨౧

వ. అని మఱియును. ౨౨

మ. తగునే? సత్కవినైన నాకు ధనకాంతాసంగమం, బీవని
న్నగరే? పండితులైనవారు వినినన్, నాకేమి యా? నవ్వినన్
మగుడ న్నవ్వెద వారి నంచు మది నిమ్మాడ్కిం బ్రశంసించు నా!
"తెగితే లింగఁడు రాయి" యంచను జనోక్తి న్నమ్మ నేమో కదా! ౨౩

ఉ. కాంతల నమ్మరాదు నెలకాంతల నంతకు మున్నె నమ్మ రా
దింత విరుద్ధ ముండునె? ఛీ! నెలకాంతకు మోహ ముండునే!
వింత గదా! జగమ్ములను వేములతీయఁదనంబు, లింతకుం
గొంత మనమ్ములో నరయఁ గూడదె? తుందుడు కింత చెల్లునే! ౨౪

*ఉ. కాంతలమాట నమ్మకొని కంతునికిం గడు లోఁకువై తదీ
యాంతరభావముల్ దెలియ "క్రైసరుబొజ్జ" యటంచు నుబ్బుచుం
డెంతవివేకులైన మది నీవిషయంబు పరీక్షనేయఁగా
నెంతయు "కుక్కతోఁకగొని యేటను బడ్డ" విధంబుగాదొకో?

ఉ. చేడెలు పిన్నకాలమునఁ జిన్నెలు వన్నెలు లేక యెంతయున్
"బూడిదబుస్స"నాకృతినిఁ బొందియు నంతట నీడు వచ్చుచోఁ
బాడుగఁ జేతు రెంత మతిపారగుచిత్తమునైన ; నయ్యయో!
"గాడిదపిల్ల కోమలము" గాదె? విచారణఁ జేసి చూచినన్. ౨౫

ఉ. "మందులు పెట్టి యెంత మతిమంతుని చిత్తమునైన లోనుగాఁ
గొందురు వారకాంత"లని కొందఱు పల్కుదు రెంతవెఱ్ఱులో!

మందులు వేశె యున్నవియె ? మాయలమాటలుఁ డక్కుఁజూపులున్
మందతరస్మితమ్ములును మక్కువ చెక్కిలి నొక్కులున్ వినా. ౬౭

వ. అని మఱియుఁ బశ్చాత్తాపమ్మున. ౬౮

సీ. గరగరలాడు నాగరవన్నె పచ్చెలల్ కాళ్ళపై వింతగా గంతులిడఁగ
జిల్గుకంచెలలోనఁ జిక్కి చక్కని గుబ్బగోయి మాటికిని దుందుడుకు సేయ
మునులనైనను దాసులను జేయఁగాఁ జాలు చూపు లింతనరాని సొబగునీన
గాంగేయసచ్ఛాయ గడలుకొల్పెడి దేహకాంతి చూపఱు గుండె గలఁగఁ జేయ

తే. గీ. నెన్నియో వన్నియల గుంపు లీనఁ జాలు
నగవు మొగమున కెంతయో సొగసుఁదెలుప
వచ్చి నాచిత్తము హరింప నిచ్చను గద ?
పరువు మరియాదలు దలంప వలదె ? కాంత ! ౬౯

ఉ. కంతునికేల నొప్పెసగు కమ్మని మామిడి పూలగుత్తి నా
నెంతయు నాదు కన్నుఁగవ కింపు ఘటించి యిదేమె ? యోసి క
ర్ణాంతవిలోచనా ! మనము నర్మిలి దొంగిలి పాఱిపోతి వా
వంతయు శంక లేక, మది నంత యరాజక మంచు నెంచితే ! ౭౦

క. ఈవిధమున నతఁ డెంతయు నావేదనఁ జెందుచుండె నవ్వనితయుఁ దా
నేవిధి దోఁచక గృహమునకై వగ మీఱంగఁ జేరి యాత్మగతమునన్. ౭౧

చ. తలఁచునొకో ? మనమ్మున నతండు ననుం దనదానిఁగా, నటుల్
దలఁచిన నేమియౌను ? దలిదండ్రుల చాటున నుండువాఁడు నా
చెలిమి గణించి నాగృహముఁ జేరఁగ నెంచునె? యిట్టివానిపైఁ
దలఁపు ఘటించుటే మొదటితప్పిఁక మాటలు వేయు నేటికిన్. ౭౨

సీ. మొదట నేనన్నచో మొగమెత్తనివాఁడు క్రమముగా మోమెత్తి కాంచఁదొడఁగెఁ
దరువాత మాట కుత్తర మొసంగనివాఁడు బుజురీతి నుత్తరం బీయఁ దొడఁగెఁ
బిమ్మట నర్మవాక్యమ్ము లాడనివాఁడు గొంచె మారీతి భాషించఁ దొడఁగె
నటుమీఁద సంస్పర్శ నాదరింపనివాఁడు కేల్పట్టికొనుట కంగీకరించె

తే. గీ. విడె మొసంగిన గ్రహియించి వేసికొనియె
గోటగీఁటినఁ జాటుగా మాటుకొనియె

మాట లిఁక వేయునేల ? నా మాటయన్న
నడుగుదాఁటునె ? యిఁకఁగొంత గడచుమీఁద. ౨౩

ఉ. అంతకు నోర్వఁ డాయెఁ బరమాత్ముఁడు, శ్రీయముఁ జెందువారి క
త్యంతము విఘ్నముల్ సలుపు, నంతియకాని యొకప్పుడైనఁ గా
సంతయుఁ జేయఁబూనఁడు సహాయము, డైవము మూఱఁజెల్లునే?
యింతకు నాకు వానికిని నేర్పడి యుండినఁ దప్పిపోవునే? ౨౪

ఉ. తా నయి కోరు టన్నఁ గడుఁ దప్పిద మాఁగడ వారకాంత ; కెం
జేనియు నద్దియుం గలిగనేని సెబా సనిపించుకొన్న మే
లా ; నది యట్లుగాక యిటులైనను వే ఱిఁకఁ జెప్పనున్నదే ?
లేనిది లేక యుండ సరిలేమలు నవ్వుటయుం దటస్థమా. ౨౫

క॥ ఇటుఁ గుటిలాలక మనమున గుటగుటమను, మారు దూఱుఁ గువలయమిత్రుం
బెటిలి పడఁ దిట్టు, నళులను గటకట మని పండ్లు గొఱికి కసరు విసువుచే. ౨౬

తే॥ గీ॥ యామినీగోపకామిని యాకసంబ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చినవెన్నముద్దయన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క. ౨౭

సీ. ఏచరణాయుధం బింపు మీఱఁగఁ బాణిని యతికి హ్రస్వాదినియతిఁ దెల్పె
నేచరణాయుధం బాచారివిప్రనిత్యస్నానదైవజ్ఞతను వహించె
నేచరణాయుధపాత్రిచర్యరూపుఁడై హరి నిశీధము వేకువనఁగఁ జేసె
నేచరణాయుధశ్రీచేత నొఁగాలి పిఠాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము ౨౮

తే. గీ. అట్టిచరణాయుధసమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోరుకలఁగ
ఉఉఉఊఊ యటంచు నత్యుచ్చరీతి
గూయసాఁగెను దమతమ గూళ్ళ నుండి. ౨౯

సీ. జాఱిపోయిన నీవి సవరించి సవరించి కులుకుగుబ్బల పైకిఁ గుదురుపఱచి
వీడిపోయిన కొప్పు బిగువుగా ముడివైచి సొగసుదుప్పటి మేల్ముసుంగు వెట్టి
చెలికానితోడను జెప్పలేకే చెప్పి మోహమ్మున మఱొక్కముద్దు వెట్టి
చనలేక యొకకొంత సాఁగి వెన్కకుఁజూచి మనములోఁ గాఠిన్యమును వహించి

తే. గీ. సంతసం బొక్కవైపు విచార మొక్క
వైపుఁ బెనఁగొన 'నీలాటిపనుల నోన
రింపఁగా వలె'నని నక్క తేలకాయ
రీతిఁ గని చనె జారనారీజనంబు. ౧౯

చ. చనుటకు నుద్యమించుఁ, "జన శక్యముగా" దని సవ్వళించు, నిం
చినతమిఁ గౌఁగిలించు చెలిచేతుల దూరముగాఁగ నుంచుఁ, జ
య్యనఁ' దల పంచు, నున్సురని యాత్మ విచారమునందు ముంచుఁ దా
వనితను బాయునప్పు డొకపల్లవుఁ డుల్లము తల్లడిల్లఁగన్. ౨౦

చ. వలపు దలిర్పఁగాఁ బ్రియునిపక్షమునం బవళించి నిద్రచే
నలసత గానుపింప వెలయాండ్రు కలల్ గలుకంగ మేలుకొ
ల్పులఁ దగఁ బాడఁగా నిదురపూనికతో విరుపూని లేచి సం
దులఁ గడుగోప్యమై తనరుత్రోవలఁ బోయిరి చాటుపల్లవుల్.

తే. గీ. లేపి పల్లవులను బంపి, లేఁతపాప్రియ
మలరు తమకన్నియలఁగూడ మేలఁకువఁగనఁ
జేసి వీణియశ్రుతిఁ జేసి చెప్పఁ దొడఁగి
రపుడు గీతమ్ములను వృద్ధలౌ గణికలు. ౨౨

సీ. కించిద్వికసదబ్జచంచదంచచ్చంచరీకదంపతుల సస్పృహులఁ జేసి
సమరతావధిఁ బృథక్ఛయ్యాస్వపద్దంపతుల నొక్కశయ్యాపైఁ గలయఁ గూర్చి
యుపరతక్రీడామహోత్సవాలసకామినీకుచస్థలఘర్మనీర ముడిపి
సంకేతితస్థలస్థనవప్రసవతల్పగతపరిమళ ముతోఁ గలసి మెలసి

తే, గీ. అమితతృష్ణార్దితభుజంగసముదయప్ర
మదవిధానాతికుశలసంపదలఁ బొదలి
మలయనిలయపటీరదుర్విలయనిలయ
మారుతములు ప్రభాతసంపదలఁ దెలిపె. ౨౩

తే. గీ. తత్తదుద్యానవనఫలలతులు మెసవి
యినుఁడు రాఁబోవుచున్నవాఁ డనియెఱింగి
పరువుపరువున నన్నియుఁబత్తికట్టి
తమతమ నివాసములకు ఘూకములు నేఁగె. ౨౪

తే. గీ. క్రమముగా జాఱె రాత్రి, సరస్తటపరి
దేశములఁ జేరి రెల్ల వైదికవతంసు,
లరుగఁజొచ్చిరి పాంథులు దురముదనరఁ,
దారక లడంగెఁ, జంద్రుఁ డస్తరుచియయ్యె. ౯౫

సీ. పద్మినీవిరచితాపారపుణ్యోదయం బుర్విలిన్యాప్తపాపోచ్చయంబు
కోకీప్రియాగమాస్తోకముహూర్తంబు ఘనహిమానికిఁ బెద్దకారుమేకము
సురతసంతోషవిస్మరణమ్మునకు క్షామ మనుతాపమ్మున కౌషధంబు
ఆవాలముల పన్ను లార్జించు కరణమ్ము చీఁకటి పాలిటి చీఁడపురువు

తే. గీ. భువనజాతంబు లేయెడఁ బ్రోచుపోఁడిమ,
మూఁడుమూర్తులు నివసించు మేడ, జగము
పాలిటి సులోచనం, బహర్పతి క్రమమ్ము
గా నుదయమందెఁ గన్నులకఱవు దీఱ. ౯౬

శా. స్నానంబుల్ పచరించువారు జపముల్ సంధించువా రగ్నిస
మ్మానంబుల్ నెఱవేర్చువారుఁ దరణిం బ్రార్థించువా రాత్మని
ధ్యానంబుల్ పొసఁగించువారు నిగమధ్యానమ్ములం జేయువా
రానందాబ్ధినిఁ దేలువారలునునై రప్పెల్లరున్ వైదికుల్. ౯౭

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితముగాఁ బాటించి పాత్రమ్ములన్
జేతం బూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి తా
మా తాత్పర్యము గొంత కొంత మదిలో నానించి విద్యార్థులెం
తో తాత్పర్యముతోడ దేశికులఁ గన్గొఁ బోయి రప్పట్టునన్. ౯౮

క. మౌద్గల్యసగోత్రభవా! సాద్గుణ్యవిచార! ధనదసమధికవిభవా!
హృద్గతభవా! సుకవితావిద్గణ్యప్రాభవా! ప్రవీణాగ్రభవా! ౯౯

క. గణనాతీతగుణశ్రీచణ! కవితారమణ! సరససాహిత్యరసో
ల్బణ! చరణాయుధరూపత్రిణయనపదసేవనాధురీణధురీణా! ౧౦౦

స్రగ్విణి. కామమాంబాలసద్గర్భశుక్తీమణీదామముక్తామణీ! ధామభాస్వన్మణీ!
సోమధామోపలస్ఫూర్తసౌధాంతరారామరాబాధకప్రాజ్యభాగ్యోదయా!

ఇది...శ్రీ తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబైన శేషలకల్పితంబగు శ్రవణానందంబను
మహాప్రబంధమునందు తృతీయాశ్వాసము. శ్రీశ్రీశ్రీ.

---

శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## చతుర్థాశ్వాసము

---

క. నూత్నపరిఖ్యాతిజితప్రత్నధరానాథమంత్రిరత్న ! సుకృతకృ
ద్యత్నదృఢచిత్త ! వేంకటరత్నామాత్యమణీ ! విబుధరాడ్రాజమణీ ! ౧

వ. అవధరింపు మనంతరంబు. ౨

క. మెల్లన మేల్కాంచి యతండుల్లములో నుండు వికృతి యొరుల కెవరికిం
దెల్లము గాకుండఁగ సంఫుల్లవదనుఁడగుచుఁ గాలమును గడపుచుఁదాన్. ౩

క. ఏదియుఁ దోఁచక కడుఁ జింతేది ముదముఁ దక్కి "యెట్టు లీమోహజలం
బీదుదుఁ గర్తవ్యం బిఁక నేది ?" యని మనమ్ములోన నెంతయు వగతోన్. ౪

ఉ. ఈవిషయంబు మానుకొనుటే కడు సౌఖ్యమటంచు నెంచి తా
నావిధిఁ జేయ నిశ్చయము నందిన యంతనె మోహమగ్గలం
బై వెనువెంట నంటు ; నటులైనను జేయుదు నన్నతోడనే
భావము వేనవేలు ప్రతిబంధకముల్ గనఁ జేయు నెంతయున్. ౫

క. మానుదునా ? చేయుదునా ? మానుదుఁ జేయుదు నటంచు మల్లాడి యొగిన్
మానిన విచార మొక్కఁడె, పూనియొనర్చిన విచారములు పెక్కులుగా ! ౬

క. అని తనమదిలో ననుకొనియును బుద్ధినిఁ ద్రిప్పలేక యొగి నుత్తరమ
క్కనకాంగికి లిఖియింపుటకును బ్రారంభించెఁ గొంతకొంత తెగువతోన్. ౭

మ. రణదుద్యన్మణికంకణక్వణజితప్రద్యుమ్నకంఖాణికిన్
గణనాతీతకలాలసద్రమణికిన్ గాదంబినీవేణికిన్
గణికోద్యన్మణికిన్ బ్రశస్తతరరేఖాపాణికిన్ బాలికా
మణికిన్ వక్త్రజితాబ్జశీతఘృణికిన్ మాద్యత్పికీవాణికిన్ ! ౮

క. అనవద్యయౌవనోదయ,ఘనరసికసమాగమాధికసుఖోదయనం
దనధనములు గలుగఁగ దీ,వన లిడి నా వ్రాయు వ్రాఁతవల నెట్టి దనన్ ;—

క. కడుమాటలేల ? విను, లోఁగడ మాకుఁ గళానిధిత్వకారణమునఁ జం
ద్రుఁడు బంధుఁడు నీకైకద ! ఒడిసెం జంద్రునకు మాకు విమలేందుముఖీ ! ౧౦

క. కలువలరేనికి వేఁడిమి, చిలుకకు విశ్వాస, మగ్నిశిఖకును శైత్యం
బలవడునుగాక, వెలకాంతలకు వలపు గలుగుటది వినంబడదు కదా ! ౧౧

తే. గీ. అట్టి గణికాకులమ్మునఁ బుట్టినట్టి
దానవే కద ! నీవును దరుణి నీకు,
వలపుగలదన్న మూర్ఖునివంటివాఁడె
నమ్మ నేరఁడు ; నేనెట్లు నమ్మనేర్తు ? ౧౨

క. నిజమయిన వలపుగలుగని గజగామినిఁ గవయువానికన్న నధముఁడీ
త్రిజగతి లేఁ ; డదియ యనంగఁజను రసాభాస మనఁగఁ గాంతామణిరో !

క. ధనమును గులమును వృత్తంబును రూపముఁ జూతు రెండు బోటులు ; మీలోఁ
బని లేదు తక్కినవి యొక ధనమె ప్రధానమ్ము గదవె తరుణీమణిరో ! ౧౪

తే. గీ. కోరతివి నన్ను ; నాబోఁటి ధీరుఁగోరి
యేమిసంపాదనముఁ జేసెదే లతాంగి ?
ధనము గల్గినవాని నొక్కని వరింపఁ
దగు నదియె కాదె నీకులధర్మ మరయ ? ౧౫

క. ఇది యంతయు నీమదిలోఁ బదిలముగా నూహ చేసి వ్రాయవలెఁ జుమీ !
తుది నిష్ఠురంబు కన్నను మొదటనె నిష్ఠురము మేలుఁగు పూర్ణేందుముఖీ ! ౧౬

క. అని వ్రాసి పంపె నంతట దినకరుఁ డస్తాద్రి కేగెఁ దిమిరము ప్రబలెన్
వనజాహితుఁ డుదయించె మదనుఁడు పథికసతులమనముఁ దల్లడపఱచెన్. ౧౭

క. ఏమియుఁ దోఁచక యవ్వనితామణి యున్నంతఁ గమ్మ తారసిలుటయుం
బ్రేమ దలిర్పఁగఁ జూచి మహామోదముజెంది తల్లి కంతయుఁ జెప్పెన్. ౧౮

వ. తల్లియు సంతసించి "జాగు సేయక వినయపూర్వకమ్ముగాఁ బ్రత్యుత్తరముం బంపు" మని చెప్పుటయు నక్కన్నెమిన్న. ౧౯

క. ఏమని వ్రాయుదు నీలని ? కేమని వ్రాసినను నీతఁ డియ్యకొను ? నటం
చీ మాడ్కిని యోజింపుచుఁ దామెల్లన నిట్లు వ్రాసెఁ దగు నైపుణితోన్. ౨౦

వ. శ్రీమదుభయవేదాంతప్రవర్తకులగు మధుసూదనాచార్యులవారి సన్నిధికి దాసురాలగు బాలామణి సాష్టాంగంబు లొనర్చి కుశలోపరి వ్రాసికొను మనవి ౨౧

క. నిన్నటిరాతిరి నుండియుఁ గన్నులుదీసికొని యెదురు గనుఁగొనుచును నే
నున్నతటి మీర లంపిన విన్నాణపుఁగమ్మ మదికి వేడ్క లొసంగెన్. ౨౨

శా. తాపంబాఱె, విచారమా సడలెఁ, జిత్తంబా మహానందవి
వ్యాపారమ్మ్యముఁ గాంచె, దైన్యగుణమా దొదవ్వులంజేరె, నా
శాపాశం బలివీర్ఘమై భవదపేక్షన్ వృద్ధిబొందించి యా
టోపప్రక్రియ నొప్పెఁ బూవిలుతుబంటుల్ నాకు బంట్లైరిఁకన్. ౨౩

క. ఇందుకు సందియమును మీరండం బనిలేదు మీరలంపించిన క
మ్మందగఁ గైకొని బ్రిహ్మానందభరితురాల నైతి నానాగతులన్. ౨౪

క. మిముఁగోరినచెందులకో తమ తెలుఁగుదు, రే నెఱుఁగుదు, దైవ మెఱుంగున్
సుమబాణుఁడెఱుఁగు నిది నిక్కము మీసందియముఁ బాపఁగా నేరుతునే ?

ఉ. వారెదఁ బ్రేమ లేనికతనం దమకన్నియు సందియమ్ము శే
పాయక తోఁచుచున్నవి సెబా ! సిఁక నిమ్మన నేల ? మీమనం
బా యరవిందసంభవుఁడె యట్టు లొనర్చిన యప్పు, డింతకుం
గాయజుఁ డేమిసేయ సమకట్టెనొ ? మీమదిఁ ద్రిప్ప నేర్తునే. ౨౬

క. "రవి కెఱుఁగరాని దైనను గవు లెఱిఁగెద " రంచుఁ జెప్పఁగా విందుము స
త్కవులైన భవాదృశు లొక యువిద మనస్థితి నెఱుంగు టొకకష్టంబే ? ౨౭

ఉ. కోరిన యంతమాత్రమునఁ గోరికతీర గ్రహించి యెక్కడా
గౌరవబుద్ధిఁ జూచి కనుగందఁగనీక సమస్తరీతులం
జేరికఁ జేసి పంతమును జెల్లఁగఁజేసెడి నాయకుండు చే
కూరఁగ నోఁచినట్టి సుమకోమలి నోము లనెట్టి నోములో ! ౨౮

ఉ. ఏలిన నేలుఁగాక జగమెల్లను, రూపమునందు మన్మథుం
బోలినఁ బోలుఁగాక ; పలుభూషలు వెట్టినఁ బెట్టుఁగాక ! యే
కాలమునందుఁ గాని రసికత్వపు సంపదచేఁ గవీంద్రుఁ
బోలెడివార లీ జగతిఁ బుట్టి రటన్న ప్రసిద్ధి వింటిమే ? ౨౯

చ. కవులొనరించు గ్రంథములఁ గాంచిన వారలె యెక్కడా రస
జ్ఞవరులమంచు నిక్కెదరుగా ! యటువంటి ప్రబంధముల్ విలా

సవిధి రచించు నట్టి కవిచంద్రుల కెట్టి రసజ్ఞతావిశే
షవిలసనంబు గల్గునో విచార్యము గాదె స్వతంత్రురాలికిన్ ! ౩౦

చ. ఇదియొక కారణం; బిదియు నిట్లనె యుండఁగ నిండు ; మీకుఁ జె
ప్పఁదగినదానఁ గా, నయినఁ బల్కెద, నొక్కతె కొక్కపూరుషుం
గదిసిన యంతమాత్ర మది గల్గును, వేఱొకఁడంతకన్నఁ దాం
బదిపదిరెట్లు లెక్కడగు వాఁడయినన్ మదిపుట్టనేర్చునే ? ౩౧

ఉ. కావున నీక్షణంబ తమకమ్మున వచ్చి యనుగ్రహించి నన్
బ్రోవఁగఁ గోరెదం దమకుఁ బుట్టెడి శంకలకున్ సదుత్తరం
బావల నిచ్చెదం, గడుఁ గృపాకరులై క్షమియింప వేఁడెదన్
దైవము సాక్షి యింతయును దథ్యమటంచును వ్రాసి పిమ్మటన్. ౩౨

చ. రవి మెఱుఁ గారెడు నక్కలుపరాయనికన్న, నిదేమి పాపమో
పవనునికన్న నామదికిఁ బావకుఁడే మెఱుఁగాయె నక్కటా !
శివశివ ! వేయిమాట లిఁకఁ జెప్పఁగ నేటికిఁ ! జిత్తజాతసం
భవమగు నాయవస్థ భగవంతుఁ డెఱుంగును నేనెఱుంగుదున్. ౩౩

వ. అని వ్రాసి యంపిన నమ్మధుసూదనుండును. ౩౪

చ. రయము భయమ్ము సంభ్రమము రక్తి విరక్తి నిరాదరాదరో
దయనయముల్ మదిం గదిసి తత్తదుపాఖ్యలఁ బుట్టఁజేయ నొ
క్కయెడ రహస్యరీతి నది గాంచి పఠించి తదీయభావని
శ్చయ మొనరించియుం జదువసాఁగుఁ బునఃపునరాదరంబునన్. ౩౪

క. కను మరలంగను మరలంగను మరలంగను నతండు గాంత దలిర్పన్
వనజాయతలోచన లంపిన వార్తల వెంతకైనఁ బ్రేమాస్పదముల్ ! ౬

తే. గీ. ఇట్టులాకమ్మఁ గనికని యెట్టకేల
కాసరోజాక్షి పొందు సేయంగ నిశ్చ
యించి తగురీతి నట కేగుదెంచుటకును
బయలువెడలె నిశీథసమయమునందు. ౩౭

మ. ఒకకొంతేగును, సంశయించును ; సముద్యుక్తత్వముం జెందు, వే
ఱొక కొంతేగు, యథాస్థితింగను ; నిరుద్యోగమ్ము వాటించు ; నిం

టికిఁ దోతెంచుట కూహసేయు ; నిటులెందేఁ గంటిమే వింత ! వి
ద్యకదా, హేతు వతండు సంశయ సముద్రాంతర్గతుం డౌటకున్ ! ౩౮

మ. మనుజుండై జనియింప రాదు, జనియింపంగల్గినం బాండితీ
ధనుఁడై యుండఁగఁ బోల, దట్లయినచోఁ దప్పేమి ? యవ్వాఁడు పుం
స్త్వనిరూఢిం గనఁబోల, దట్లయిన నవ్వాఁ డంగనాకామియై
చనరా దొండెడ, కట్టులైనను రహస్యప్రక్రియల్ గూడునే ? ౩౯

ఉ. " ఎవ్వరు గందురో మఱియు నెవ్వరు విందురొ యేమనందురో
యెవ్వరు పల్కరింతురొ మఱేమొ ?" యటంచును సంశయించు వాఁ
డివ్వసుధం బరాంగనల నెట్టులఁ బొందగ నేర్చు ? భోగపుం
జవ్వని పొందు సేయుటయె సాధ్యము గా దటువంటివానికిన్. ౪౦

క. కలచెడిపామును మీఁదం బఱచెడి భూతంబు నెఱుఁగఁబడక మనము ని
బ్బరముగఁ దిరిగెడి గరకరి బిరుదులె పో ! జారకృతికిఁ బెట్టిన పేరుల్. ౪౧

సీ. చూపట్టునట్టివస్తువు లెల్లఁ దనుఁ బట్టఁగావచ్చు వారంచుఁ గాంచకున్నె ?
వినవచ్చునట్టి నిస్వన మెల్లఁ దనుఁ బల్కరించు పల్కు లటంచు నెంచకున్నె ?
ఎడనెడ నడచి పోయెడి వారలెల్లఁ దన్ జూచువారలె యంచుఁ దోఁచకున్నె ?
అగుపట్టు నట్టి గృహమ్ములన్నియుఁ బ్రియురాలివే యని శంక నందకున్నె ?

తే. గీ. అహహా ! క్రొత్తగ వ్యభిచార మాచరింపఁ
బోవుచున్న రహస్యపుఁ బురుషులకుఁ ద
టస్థమగునట్టి యీదురవస్థ శత్రు
వర్గమునకైన వలదురా ! వలదు వలదు. ౪౨

వ. ఇట్లు సంశయించుచుఁ దుదకుఁ జనఁజాలక కాలయాపనంబునకై యొక సుహృ
ద్గేహమ్మునకుం బోయి యటఁ బరుండుటయు. ౪౩

చ. దొరకిన పెన్నిధానమును దొంగల కిచ్చినరీతి, నాతఁ డీ
వరుసఁ బరుండి యుండ, గుణవంతుఁ డనం జను నొక్క మిత్రుఁ " డీ
కరణిఁ బరుండనేమి ? " యని గట్టిగఁ దన్నడుగంగ నాతఁ డా
దరమునఁ జేతి కిచ్చె నల తన్వి లిఖించినయట్టి పత్రికన్. ౪౪

క. ఇచ్చి "భవత్తాత్పర్యం బచ్చొత్తిన రీతిఁ జెప్పనగు" నన నతఁడీ
సచ్చరితున కిది తగదని చెచ్చెరఁ దలపోసి హితముఁ జెప్పఁదొడంగెన్. ౪౫

చ. "కులమును బ్రాయముం యశముఁ గోవిదభావము భాగ్యవర్తనముం
జెలువము సత్ప్రవర్తనముఁ జేతికి మించినయట్టి యీగియుం
గలిగిన మిమ్ము నొక్క వెలకామిని గోరుటకబ్బురంబె, మి
మ్ముల విని నంత నే చెలికిఁ బుట్టకయుండు మనోవికారముల్? ౪౮

ఉ. చిన్నతనమ్మునుండియుఁ బ్రసిద్ధివహించి జగంబునందు బల్
వన్నెకు నెక్కఁగల్గు తగువర్తనచేఁ జరియించునట్టి మీ
రన్న, మహానుభావులు గదా? తమబోఁటులె యిట్టులైనచో
నున్నటువంటి వార 'లిది యుక్తమొకో' యని సంశయింపరే! ౪౯

సీ. తల్లిదండ్రులువిన్నఁ దప్పుగా గణియింతు రత్తమామలు విన్న నాదరింప
రూరిపెద్దలువిన్న గారవింపరు, మాట వినఁదగువారును వినరు, తనకుఁ
బ్రాణమిత్రులుగూడఁ బరిభవింపఁగఁజూతు రాలు చుల్కనఁజేసి గాళ్ళుజేయుఁ
దన నవుకరుఁగూడఁ దన్ను హేళనఁజేయు నన్న నన్యులమాట లెన్న నేల?

తే. గీ. ధనము చెడుఁ, గీర్తి చెడు, దేహమునకు లేని
పోనిదురవస్థ గల్గును గాన విత్త
కాంతలనుగూడువారి కొక్కయెడనైన
నగుపడదు సౌఖ్యము విచార మడుగవలెనె?

వ. ఇదియునుం గాక ౫౦

సీ. అర్థ మిచ్చినయప్పు డతిగౌరవము సేయు నర్థ మీకున్న మూఁడంకె వేయుఁ
గాసు లిచ్చినఁ గాళ్లు గడిగి నెత్తిని దాల్చుఁ గాసులీకున్న బింకాలఁ జూపు
లంచ మిచ్చినను లాలించి ముద్దులు వెట్టు లంచ మీకున్నఁ జిట్లించు మొగము
నగలు దెచ్చినయప్డు వగ లెన్నియో చూపు నగలు తేకున్న నాపగలు నున్న

తే. గీ. చీర లిచ్చినయప్డు హర్షించి చూచుఁ
జీర లీకున్న యప్డు కుంచించి చూచుఁ
గంచుకాగడ వెలిఁగించి కనినఁగాని
వలపు గన్పట్టునే వారవనితలకును? ౫౧

తే. గీ. వన్నెచిన్నెలుగల గొల్లకన్నెమంత
సర్వజనులును ద్రొక్కు బజారుసంత

అందఱును నేఁగ నేమించినట్టిపుంత
వంతలకు వింతదొంతర వారకాంత. ౫౦

ఉ. ఏరికినైనఁ గూడవు ధనేచ్ఛఁ జరించెడి వారకామినీ
చారుకుచోపగూహనవిచారము లన్నపు డుత్తమోత్తమో
దారయశోవిశేషపరిధానవిభూషితసర్వదిక్సతీ
వారు లనంగ నొప్పు తమవంటి మహాత్ముల కర్హ మెట్లగున్! ౫౧

చ. గుణవంతుండనునోట "ముండలముటాకో" రీతఁడంచున్ బుధా
గ్రణు లాక్షేపణఁజేయఁబూనుదురు; చుల్కంజేసి మాబోఁటులున్
గణనంజేయ రటంచు మైత్రినిటుఁ బల్కంబూనితింగాని వా
గ్రణముంజేసి మరల్తురే? హరిహరబ్రహ్మాదులైనన్ మిమున్. ౫౩

క. వినది కావని యనఁగాఁ గానిది యానవచింపఁగాఁగల మీతో
"నేనా, వాదముచేయుట? యేనూఱుగురైన మీకు నెదురే? చెపుడీ" ౫౪

క. అని యాతఁడు పలికిన, నిట్లను, "మీతోఁ జెప్పి మంచియగునో, కాదో
వినఁగోరి యడిగితిని మంచి నిదానమ్ముగను మీరు చెప్పితిరిసుఁడీ. ౫౫

క. తనకెంత తెలివికలిగినఁ దనకార్యముపట్లఁ దానె తగుదుననుట యొ
ప్పనిపని; యోగ్యతగలిగిన తనమిత్రుల నడుగుటొప్పఁ దగవరికెందున్. ౫౬

ఉ. ఇంతియ కాక మీ రెఱుఁగరే? ననుఁ బిన్నటనాఁట నుండి యీ
వింతలలోని కెన్నఁడును వేడుకఁ జేసి మనంబుఁ బోన్ప; నీ
కాంత యదేమొ కాని నను గాసిలఁజేయుచునున్న దందుచే
నంతయు మీకుఁ దెల్పి తెలియన్ వినఁగోరితి మంచి చెడ్డలన్". ౫౭

క. అని యతఁడు చెప్పనీతులు విని యప్పనిపట్ల నితఁడు విముఖుం డాయెన్;
ఘనులగు మిత్రులు గలిగిన మనుజులు దుర్వ్యసనములకు మఱగుట గలదే? ౫౮

సీ. 'ఇప్పుడే వచ్చునో, యిఁకనె వచ్చునో' యంచుఁ దలవాకి లిల్లుగా నిలిచి నిలిచి
'వచ్చువాఁడైన నీవఱ కేల రాకుండు?' నని మనమ్మున శంక నంది యంది
'నేను వ్రాసిన కమ్మ నిజముగాఁ జూచెనో, చూడలేద'యటంచుసొక్కి సొక్కి
'రాకుండునా? యిప్డు రాత్రి యెంతో ప్రొద్దు పోలే'దనుచుమదిబొక్కి బొక్కి

తే. గీ. యున్న కన్నెను మరుబారి నుంచివైచి
స్నేహితునిమాటలకుఁ బ్రతిఁజెప్పలేక

చనక యచ్చోట నిద్రింప సాఁగె నతఁడు
నిదుర యేరీతిఁ బట్టెనో ? మది యెఱుంగు. ౫౯

ఉ. ఇంతకుమున్నె యవ్వనిత యెంతయు సంతస మంది 'మన్మనః
కాంతుఁడు నేఁడు రాఁగలఁడుగా !' యని భూషణభూషితాంగియై
వింతగఁ గేళికాగృహము వేగ నలంకృతిఁ జేయఁ జేసి 'యే
మింతఁగఁ గాలయాపనము నీతఁ డొనర్చె' నటంచు నెంచుచున్. ౬౦

చ. వడివడి వచ్చువానివలె వార్తను బంపియు నింతరాత్రి దాఁ
గడచినమీఁదనైన నిటఁ గాలిడఁ, డెంతటి సత్యవాది యీ
తఁడు ! నను నింత చుల్కఁగ నెదన్ గణియించునె ? వచ్చెనేని, నే
నడుగక యుందునే ? మనమునందలికోపముఁ దీర్పకుందునే ? ౬౧

క. అని కనులు దీసికొని యాతనిరాఁకకు నెదురుచూచుతనయం గని నె
మ్మనమున వినువు దనర నవ్వనజానన తల్లి యిట్లు పలికెం బెలుచన్. ౬౨

ఉ. ఓతలిరాకుబోఁడి ! వినవో ! నిజ మొక్కరివంటివాఁడు గాఁ
డాతఁడు, వచ్చునే మనగృహమ్మున ? కాతనియందుఁ గాంక్ష నీ
చేతమునందు గట్టిగ వసింపుచు నుండిన నేను జెప్పు నీ
రీతిగఁ జేయు మాతఁడె వరించి గ్రహించు నినుం గ్రమమ్ముగన్. ౬౩

క. చదువను నొకమిషఁ బూని ప్రతిదినమ్మును నతని సన్నిధికి నేగినచో
మదిఁజనవు హెచ్చి క్రమముగఁ బదును చెడు న్నిక్కమిది యుపాయము సుమ్మీ.

క. మచ్చట కాతనిమదిలో నిచ్చవొడమెఁగాని యిచటి కేతెంచెడి యీ
ముచ్చట లన్యులు గన్నను జచ్చినచావగు నటంచు సంశయపడియెన్. ౬౫

చ. క్రమముగఁ గొంతకాలము గరమ్ము రహస్యముగాఁ బ్రవర్తనం
బమరినమీఁదఁగాని "యెవరైననుఁ గాంచెదరే మొ" యంచు శం
క మొదటఁ దోఁచు నెట్టివిటకాంద్రకు నన్నపు, డెప్పు డిట్టి క
ర్మముల నెఱుంగనట్టి జనమాన్యులు సందియమందకుందురే ?

తే. గీ. క్రమముగాఁ గొంతసఖ్యమ్ము గలిగెనేని
విందురందఱు, నామీఁద విడుచు లజ్జ ;
"నలువురు వినెడిదాఁకనె గలుగుసిగ్గు,
నడుము మునిఁగెడివఱకె చలపడును జలియు".

తే. గీ. ఇటులఁ దనపుత్రికకుఁ గార్యఘటనకు నదు
పాయ మెఱిఁగించి నిద్రకుఁబడియె వృద్ధ;
అటుల నొనరింప నక్కన్నె యనుమతించి
యెపుడు తెలవాఱు నని మది నెంచునంత.

ఉ. కొక్కురకొక్కురో యనుచుఁ గుక్కుటముల్ పలవించె; నంతలోఁ
జుక్క పొటుక్కునం బొడిచె; సుందరమంథరగంధవాహముల్
నిక్కెఁ; దమంబు స్రుక్కె; నళినీసతికిన్ రుచు లెక్కె; నొక్కపై
జక్కవ లార్తిఁ దక్కె; జలజప్రియుఁ డెక్కె సురేంద్రుదిక్కుపై. ౧౯

సీ. కలుము లీనెడి కన్నుఁగవ వీధినల్గడల్ నల్లగల్వలతోరణములు గట్టఁ
గారుకమ్ములు గ్రమ్మఁగాఁ జాలు వేణికారుచులు తుమ్మెదలబారులు ఘటింప
సహజదరస్మితస్వచ్ఛకాంతులు దంతములకాంతిఁగూడి వెన్నెలలు గాయఁ
దళతళల్ మీఱు గుత్తపుఁ జన్నుఁగవ పొంగు త్రోవఁ గన్పడువారిఁ దొంగిచూడఁ

తే. గీ. బ్రతిదినము పూఁట కొకసారి పనినిఁ బూని
యతని సన్నిధి కేతెంచు నది మొదలుగఁ
బుస్తకము హస్తమునఁ బూని పొలఁతి యొకతె
తనకుఁ జేదోడువాదోడుగను మెలంగ. ౨౦

చ. తమనుతు నూత్నయౌవనవిధమ్ము నెఱుంగరో! వారకామినుల్
కుమతు లటం చెఱుంగరో! చెలుల్ మఱి యెంతటివారికైన మో
హమయులుగా నొనర్తు రను నంశ మెఱుంగరో! తల్లిదండ్రు లు
త్తము లన రాదె? వేఱొకవిధం బయినన్ మఱి సమ్మతింతురే? ౨౧

చ. ఒకరకమైన పావడ మఱొక్క రకంబగు రైకయున్ మఱిం
కొకరకమైన పైఁటయు మఱొక్కరకంబగు భూషలున్ ధరిం
చుక ముకురంబుఁ జూచుకొని సొంపుగలేదని యెంచి, యంత వే
ఱొకటి మఱొక్క టింకొకటియున్ ఘటియించు నటేగు వేళలన్. ౨౨

వ. అట్లువచ్చి

చ. చదువను పేరె గాని యొకసక్కపుమాటల నాడుచుండు, సం
దొడదినటప్పుడెల్ల నెదిరౌ నొకసంగతిఁ దెచ్చి " పండితుల్

మొదలె యబద్ధమాడుదుర, మోసముచేతుర వారినమ్మ టొ
ప్పదు నుఁడి " యంచుఁబల్కి తలవంచి నగున్ మొగమెత్తఁ గ్రమ్మఱన్. ౭౪

చ. పలుచని పండుటాకులకుఁ బాగుగ నీనెలుదీసి చక్కఁగాఁ
జిలుకలుచుట్టి దొంతరలుచేసి యమర్చి కరాంగుళీదళం
బుల నిటికించి తెచ్చి వలపుల్ మొలపింపుచు నిచ్చి యంతటం
బలుకును జిల్కపల్కులను వ్యంగ్యపురంగు చెలంగి పొంగఁగన్. ౭౫

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుం గనుల్, బన్మిటా
రించుం జన్గవపై చెఱంగు, వల పూరించున్, నగించున్, బ్రశం
సించున్, మించు మనోవికారమును సూచించున్, మరుల్ వెంచు ; న
మ్మించుంబోఁడిస్వభావమో ? యతని నమ్మించన్ బ్రయత్నించుటో ? ౭౬

చ. ఎడపక యెల్లవేళ మతి యెప్పుడు చూత మటన్నఁగాని య
క్కడనె వసింపుచుండుటయ కాని యొకానొకవేళనైనఁ దాఁ
దడయక యింట నుండినవిధం బది యెట్టిదియో యెఱుంగ ద
ప్పడఁతుక, దానిచిత్తమును బట్టిన భూత మదెట్టిదో కదా! ౭౭

సీ. ఒకమాఱు మనుచరిత్రకథాంశమున వరూధిని మరుల్ వెందు పట్టునను జదువు
నొకమాఱు నాయికాదికచేష్ట లెఱిఁగించు రసమంజరీరసప్రస్రుతిఁ జదువు
నొకమాఱు నభినయప్రకటీకరణచణాభినయదర్పణరసాభిరతిఁ జదువు
నొకమాఱు గానవిద్యోపయుక్తస్వరసంగ్రహముఖ్యగ్రంథసంగతులు చదువుఁ

తే. గీ. క్రొత్తక్రొత్తలు జావళీల్ క్రొత్తక్రొత్త
పదములును క్రొత్తక్రొత్తలౌ వర్ణములును
నింపు దళుకొత్తఁగోరి రచింపఁజేయు
నేమి చెప్పఁగవచ్చు ? నయ్యింతిచర్య. ౭౮

ఉ. ఆవగలాఁడి వచ్చువఱ కాతఁ డనంతవిషాదవేదనల్
భావమునందుఁ జెందు ; నటుపైఁ జనుదేరఁ గ్రమక్రమమ్ముగాఁ
జేవ మనమ్మునం దగులఁ జేయును గాని మనోవికారసం
భావన బైటఁ బెట్ట డట! బాపురె! యాతనిభావ మెట్టిదో! ౭౯

ఆ. వె. ఆసరోజనేత్ర యరుదెంచువఱకె సం
తాప మతని, కాలతామనోజ్ఞ

అరుగునంతవఱకె యామోద మీగతి
నరిగెఁ గొన్నిదినము లంతలోన, ౨౦

ఉ. వేసవి వచ్చె భాస్కరనవీనగవీనమితామితాచ్ఛగు
చ్ఛాసవవాసనై కవలనాకలనాకులనాయికాసము
చ్ఛ్వాసనశ్వాసనాదికృతిఝుంకృతిసంకులషట్పదావళీ
భాసురశుష్కపుష్పవిటపప్రకరప్రతిభాప్రమోదమై. ౨౧

సీ. సూనబాణునికేళిఁ జొక్కి యక్కున వ్రాలుప్రియురాండ్రఁ బైఁటచే విసరువారు
విసరినందులకునై కొసరి యింకొకసారి వెడవెడపనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పకున్న క్రొన్ననబోణులను "మాబగులు దీర్పు" మనెడివారుఁ
దీర్చుకొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి చనువారిఁ గని ముద్దుఁ గొనెడివారు

తే. గీ. ముద్దుఁగొని నుద్దులను గొంతప్రొద్దుజరపి
మలయవాయువు లిరువురఁ గలఁక దేర్పఁ
గలయఁదమకించి కోడికూఁతలకుఁ దలఁకు
వారలైరఁట గ్రీష్మవిభావరులను. ౨౨

చ. వదలినఁ జచ్చిపోదు మనువారలు తక్క సమస్తదంపతుల్
పొదలెడి గ్రీష్మతాపమును బొంది సహింపఁగలేక తెల్లవా
ఱుదనుక వేలువేలుగఁ బరుండి నిశాంతసమీరపోతసం
పద లోలయంగ నైక్యగతి వర్తిలఁ బూనుదు రట్టివేళలన్. ౨౩

ఉ. వేసవితాప మిట్టి దని వేమరు నొక్కి వచింప నేల? యా
యాసము నొంది తాపమునఁ గాఁగఁగ లేక రమావిభుండు దా
వాసముఁ జేసె నంబుధి. నివాసముఁ జేసె నుమేశుఁడున్ హిమా
నీసముపేతపర్వతవనీతటినీతటకుంజమండలిన్. ౨౪

చ. ఇతరుల దాహపుం గతుల నెన్నఁగ నేల! దినేశు నంతవాఁ
డతితరతృష్ణచేఁ దన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికిఁ గనంబడి నంతయుఁ ద్రావె నీరమున్. ౨౫

ఉ. అట్టి బెడంగుకాఁక నలరారి వెలింగెడి గ్రీష్మతాపసం
ఘట్టనమున్ స్మరాగ్ని యలుకం గని దాని జయింతు నంచు ఖల్

వెట్టతనంబు పూని కడు వృద్ధినిఁ జెంది వియోగతప్తులం
బట్టి పలార్చెఁగాని పరిపంథినిఁ బట్టి పలార్చ నేర్చెనే ? ౭౫

శా. వచ్చెం బ్రోషితభర్తృకాంగనల తాపం బార్పఁ బెన్గానలం
జిచ్చుల్ మాయఁగఁ జేయ సస్యములకున్ జేయూఁత గైసేయ వి
ద్యుచ్చంచద్ఘనమాలికానినదభీత్యుద్వేజితస్వాంతయో
షిచ్చారూన్నతమాంసలస్తనభరాశ్లేషంబు వర్షర్తువున్. ౭౬

తే. గీ. వాన కేళీగృహమ్ములు వదలనీదు
చలి తమంతనె కౌఁగిలింతలను దార్చు
మబ్బు రాత్రిందివమ్ముల మాటుపఱచు
వర్ష ఋతువంత యేది ? దంపతులదాది. ౭౭

క. బోరునఁ బడియెడివర్షాసారంబులు వహ్ని నపుడు చల్లార్చంగాఁ
జారుస్త్రీకుచకలశాధారంబై బ్రతుకుఁ గాంచె దంపతిమధ్యన్. ౭౮

వ. అట్టియెడ నింట నెవ్వరును లేని యొక్క నాఁటి రాత్రిసమయమ్మున నత్తలోదరి మితభూషితాంగియై "అనుగుణంబగు సమయంబు నేఁటికిఁ జేకూరె" నని సంతసింపుచు రహస్యప్రకారమ్మున

ఉ. వచ్చి గృహమ్ము సొచ్చి యొకవైఖరి నాతనిఁ జూచి యంతఁ దా
నచ్చపలాక్షి యాతఁ డసహాయత శయ్యఁ బరుండి గ్రంథమున్
జెచ్చెరఁ జూచుచుండఁ దరిఁ జేరఁగ సందియ మంది ద్వారమం
దచ్చపు బంగరుంబ్రతిమ యట్టుల డాఁగిలియుండి క్రమ్మఱన్. ౮౦

క. మెల మెల్లనఁ జని శయ్యాతలనికటమునందు నిలువఁదత్తఱమున న
వ్వాలఁ దుకఁ బొడఁగని యాతఁడు నిలువున నీరాయె నదియు నివ్వెఱపడియెన్.

క. అతఁడును నదియును నిటు ల, ప్రతిపత్తి విమూఢగూఢభావోదయసం
గతులైయుండిరి క్షణపరిమితకాలం బదియు శక్యమే ? వర్ణింపన్. ౮౩

సీ. తనకు సద్దాని పై మనము పుట్టకయున్నఁ 'బొమ్ము పొమ్మ'ని చెప్పఁబోలదొక్కొ!
ఇచ్చగల్గినఁ జనవిచ్చి కౌఁగిటఁ జేర్చి మరుకేళిఁ గరఁగింపు టెఱుఁగఁడొక్కొ!
అక్కన్నెయొవ తెరో యనుట కింతకుమున్ను ప్రతిదినమ్మును గంటఁబడనిదొక్కొ!
పాటునుంచును భయంపడుట కీలోననే హృదయసంగతులచేఁ బొదలఁడొక్కొ!

తే. గీ. కామశాస్త్రప్రశంసలఁ గనఁడొ, వినఁడొ !
యేమిభావించెనో యాతఁడెవరికెఱుక ?
రమ్మనియుఁ బొమ్మనియు మాటరాదు నోట
" వలపు సానికిఁ బలుపు దెబ్బలు " ఘటించు.

తే. గీ. అటులఁ దన్నాదరింపని యతనిరీతిఁ
గాంచి మదిలోనఁ గోపమ్ముగదుర మరలి
పోవుటకు నుద్యమించి యూర్పునిగుడించి
యుంచుక మనమ్ములోన యోజించి మఱియు.

ఉ. దాపునఁజేరి హస్తమునెదం గదియించినయంతమాత్ర నే
కాఁపుర మాయె మేను పులకప్రకరమ్ములకున్, మనమ్ములోఁ
గాఁపురమున్న జ్ఞానము పికాపికలై చనె ; నెట్టకేలకుం
బాపపుభీతియుం దొలఁగి పర్విడె ; నెంతకుఁ జాలరంగనల్ ! ౯౭

శా. ఆరీతిం గని యాసతీతిలక మత్యానందముం జెంది " ని
న్నే రామామణి యిట్లుచేయఁగలదోయీ ? యంగనాయోగ్యమా
గారామెల్లను నీవచేసెదవు పో ! కాకేమిరా ! " యంచుఁ గ
ర్పూరామోదితపూగసంకలితతాంబూలమ్ము నందిచ్చుచున్. ౯౮

ఉ. " మంచిదికాని, ' వేశ్యలకు మాయలు మెండెటువంటివారలన్
వంచనఁజేతు ' రందు ; రది వాస్తవమే ; తమవంటి వారికిన్
వంచన మంచి గాదుకద ? వచ్చెడియట్లనె యుత్తరమ్ము వ్రా
యించియు రాకపోవు టిదియేకద ? ధర్మము మంచివారికిన్ ". ౯౯

తే. గీ. అనిన నతఁడిట్టులను " నింద్యమనియుఁ బాప
మనియు నేమానితినిగాని యన్య మెఱుఁగఁ ;
జేతునని చెప్పియును జెడ్డ సేయరాదు,
చేయనని చెప్పియును మంచిచేయవచ్చు.

ఉ. ఇప్పటికైనఁగాని మన మెంతయు సందియమందుచుండె నీ
తప్పులనెన్న నేనెఱుఁగఁ దన్విరొ ! నీదు కతమ్మనంగదా !
యిప్పటి కిట్టిరీతి ఘటియించె ; మఱొక్కటి విన్ము, నీయెడం
దప్పెపు డబ్బునో యపుడ తప్పఁజుమీ ! మనస్నేహభావముల్. ౧౦౦

క. అని ప్రీతినప్పేఁ బలుకుచు ననుకంపాకంపితాంతరంగుండై య
వ్వనితామణికిఁ వశుఁడై యనుకూలుండై పరవశుఁడై తమిఁ జెందెన్. ౧౦౧

సీ. అజ్ఞాతగాత్రభేదనజ్ఞానవిలసనం బనతీతరతిరహస్యాగమంబు
అనిరుద్ధదంతచ్ఛదామృతాస్వాదనం బప్రియత్వాప్తబంధానుగమము
అనిమిత్తతాడనాన్యోన్యసంభృతసుఖం బజ్ఞేయపూర్ణమోదానుభవము
అనుపసంహృతవచఃపారంభసంరంభ మనివార్యసుప్రమోదకావతార

తే. గీ. మవిదితనఖక్షతవ్యథం బప్రమేయ
రసవిశేషపరిసార మరాళచేష్ట
మనియతాలింగనాఢ్య మవ్యనజగంధి
ప్రథమనిధువన మక్కవిప్రసనరుఁ డెనసె. ౧౦౨

*సీ. ... ... ... ... ... ...

క. కుచకించిచ్చలనంబు కటిచమత్కారంబు మేని శీవి బెళుకుఁజూ
పు చురుకు సారెకు వర్ణింపుచు మెచ్చె నతండు దాని పుంభావంబున్. ౧౦౪

చ. ఎఱుఁగరు కష్టమింత సుఖమింత విలాసవిశేషమింత యం;
చెఱుఁగరు మోహమింత వలపింత పెనంగిన దింతయంచు నా
సరసుఁడు నాసఖీమణియు సౌఖ్యరసాంబుధిలోన మున్గి తే
లిరి ; వివరింప శక్యమె ! బళీ ! మఱి వారి వినోదవైఖరుల్. ౧౦౫

వ. అంత

తే. గీ. జారిణీజారసురతపరిసంగభంగ
మంగజానంతతాపశాంత్యౌషధంబు
చోరకృత్యాంతరాయ మాచారివిప్ర
కోటివిజ్ఞప్తి వినరయ్యెఁ గోడికూఁత. ౧౦౬

వ. అంత

సీ. నలిగిపోయిన పుష్పములు కీలుజడనుండి యడుగడ్డునకుఁ దొరవయందు రాల
మలయు ప్రాతఃకాలమలయవాయువులచేఁ జెమటబిందువుల మొత్తము లణంగఁ
గురియు నున్మంచుతుంపురులు కెమ్మోవినొక్కుల కించుక భరమ్ముఁ గలుగఁజేయ
నతిరతిపరవశస్థితి వియ్యమందు నిద్దుర నెత్తికెక్కఁ తత్తఱముఁజూప

తే. గీ. ' నెవరుచూచెదరో ' యంచు నించుకంత
భయముగల్గియు, 'నాకేమి భయ' మటంచు
దిటము మదిలోననూని యచ్చటుల నేతి
" టింగురంగా " యటంచు నింటికిని జనియె.

క. దీనజనాదరణా ! శరణానుగతాభరణ ! సంశితాశ్రితతరణా !
నానావిధగుణవరణా ! భూనుతచరణాయుధాంక భూతేట్స్మరణా! ౧౦౭

శా. ఆగర్భానుగతప్రకృష్టధనధాన్యామూల్యసౌధాదిను
శ్రీగణ్యా! సరసాగ్రగణ్య ! సితనీరేజాతవాతాశనే
డ్నాగాలంకరణాగశీతనగమాన్యస్వచ్ఛకీర్తిప్రభా!
భోగత్యాగసుయోగ ! సత్కవిజనాంభోజాబ్జినీబాంధవా ! ౧౦౮

స్రగ్విణి. శ్రీమదానందపరిఘ్నజిష్ణూదయారామ ! కామేశ్వరీప్రాజ్యదీవ్యద్దయా
సీమ ! సీమంతినీశ్రీతనూజా నయ గ్రామ ! కామేశ్వరీగర్భచంద్రోదయా !

గద్య

ఇది శ్రీ...తిరుపతివేంకటేశ్వరప్రణీతంబైన కేవలకల్పితంబగు
శ్రవణానందంబను మహాప్రబంధమ్మునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## పంచమాశ్వాసము

---

క. శ్రీమహితపీఠికాపురధామ ! నిరుపమానకీర్తిధవళితసకలా
శామండల ! వేంకటరత్నామాత్యవరేణ్య ! రసికతాధికగణ్యా !

తే. గీ. అవధరింపు మనంతరం బంత సూర్యుఁ
డుదయగిరి నెక్కె ; నతఁడు యథోచితముగఁ
గృత్యములు దీర్చుకొని రాత్రికృత్యమునకు
మోదమందు మఱింత విషాద మంఁదు.

సీ. ఏకాంతఁ గనుఁగొన్న నీసడించెడిబుద్ధి యాకాంతమీఁదఁ దా సోఁక నేల ?
సోఁకిన నేమి, యాసుందరీమణి తనంతనెవచ్చి నన్నుఁ గైకొనఁగ నేల ?
కైకొన్న నేమి, చిక్కఁదనం బఱంగ నా కామినీమణితోడఁ గలయ నేల ?
కలసిన నేమి, యాకామినీమణి పొందు పరవశత్వమొనర్చి పరఁగ నేల ?

తే. గీ. పరఁగుఁగాకేమి, బుద్ధి దా మరల నేల ?
మరలుఁగాకేమి, బొత్తిగా మరల దేల !
వేయిమాటల ఫలమేమి, విధికినైనఁ
గామదేవుఁ జయింప శక్యమ్ముకాదు.

మ. ధనమా , పోవును ; మానమా , చెడును ; నిందా , నెత్తిపైకెక్కు ; లో
ననుమానింతురు తల్లిదండ్రులు ; కులంబా , వన్నెకుందక్కు ; నా
తనమాంద్యమ్ము ఘటిల్లు ; బందుగులు పంతంబొప్ప నిందింతు; రో
మనమా ! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁగాపాడుమా! ౪

మ. ' విను నీబోఁటు లనంగ నెంత ? మును గంభీరపరిభావాఢ్యులా
మునులే ముచ్చటలందు మున్గి ; రదియేమో పెద్దబ్రహ్మాండమా ? '

యన రాఁబోకుము వారికి న్మనకుఁ గొండం తంతరం బున్న; దో
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౫

మ. 'మును లీలాశుకకాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ధనస్త్రీలతో
డను గ్రీడింపరె? దాన వారల ప్రతిష్ఠల్ వోయెనే?' యంచు నీ
వనఁ దప్పౌఁ జుమి; నక్కయేడ! దివిజాశ్వత్థాలయం బేడ! నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౬

మ. 'తనయంత న్నినుఁ గోరి వచ్చినది యాతన్వీమణి న్వీడఁగాఁ
జను నే? నీ' కని బుద్ధిచెప్పెదవు మెచ్చన్ వచ్చు నీసుద్ది; యా
తనువే, శాశ్వతమా! పరమ్ము వలదా! తప్పుల్ విచారింపవా!
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౭

మ. తనువుల్ బుద్బుదముల్, యశం బనఁగ నిత్యా, మ్మట్టి యీ సద్యశ
మ్మును నీతుచ్ఛసుఖాప్తికై క్షణములోఁ బోఁగొట్ట నుంకించె దీ
వనుమానింపవు లేశమాత్రమయినన్ హా! యెంత దౌర్భాగ్యమే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౮

మ. జననంబంది సమస్తపండితులు మెచ్చన్ దెచ్చికొన్నట్టి కీ
ర్తిని నిష్కారణ మొక్కనాతికయి వార్ధిం గల్పఁగా నేల? లోఁ
గను, అంకొక్కటి నూఱునోములను మెక్కంజాలు నిక్కమ్ముగా
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౯

మ. 'వనితాసంగమ మెన్నఁ జంచలము, స్వప్నప్రాభవం; బట్లు కా
దని చేయం బరిణామనీరసకరం, బాజోలికిన్ బోకు' మీ
పని వేసారులు చెప్పియుం దుదకు నాహా! యెంత చేయించితే!
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౦

మ. 'నను నీ వెప్పుడుఁ బాయ వద్దనుచు నా నారీవతంసంబు దె
ల్పిన 'నల్లే' యని యొప్పుకొంటి, నిపు డాలేమ న్విడంబాప మా
నని యూహించెద, వెంత సత్యమతివో హా! మెచ్చఁగావచ్చు నిన్
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౧

మ. 'జననంబందిన దానికిన్ ఫలము వేశ్యాకామినీవక్త్రచుం
బనమే కాక మఱేమి యున్న దిదియే భవ్యం బభవ్యంబు గా?'

పని వాదించెదు, నీచరిత్ర మది వహ్వా! మెచ్చఁగా వచ్చు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౨

మ. జననం బందిన దానికిన్ ఫలము పచ్చారిత్రుఁడై సర్వస
జ్జనులుం దన్ను నుతింప ధర్మపరుఁడై సాక్షాత్పరబ్రహ్మముం
గన నూహించుట కాక, కామి యయి భోగస్త్రీల భోగింపుటా?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౩

మ. 'తనుఁ దా వచ్చినవేశ్యఁ గూడు సుఖ మింతా! యెంతయో తెల్ప నా
కను వౌనా? యది యట్టు లుంచు మిది బ్రహ్మాదుల్ గణింపంగ శ
క్తిని బొందం గలరా!' యటం చనెదు, నీతీపింత గాఁబోలు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౪

మ. 'అనువయ్యెన్ గద! నీకు దీనికిని జాత్యాదుల్ కళాశాస్త్రరీ
తిని, వహ్వా యిఁక దీనిపైఁ జనెడి బుద్ధిన్ ద్రిప్ప నీ వొప్పుకొ
న్నను నేనొప్పదు నే?' యటం చనెద నన్నా! యెంతస్వాతంత్ర్యమే!
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౧౫

క. అని యీగతిఁ దన మనమున ననేకరీతులుగ నెంచి యనుతాపమ్మున్
గను నాలోనసె యచ్చెలి చనుదెంచె యథాస్థితముగఁ జదువను మిషచే. ౧౬

క. చనుదెంచెఁగాని యాతని మునుపటిరీతిఁగను జూడ మోమోటముఁ జెం
దును, వెల్వెలఁబాఱును, సిగ్గునగను; మెతకగుణ మెంత కూరపుగుణమో! ౧౭

చ. చదువఁగ సంశయించు, నెకసక్కెము లాడఁగ సంశయించు, సాం
పొదవ బుజుపరికారమున నూరక యుంటకుఁగూడ సంశయం
బెదఁగను, నింతకన్న మునుపే కడు మేలని లోననెంచు నా
సుదతి; పరుల్ గదా! హృదయచోరులు కాంతల కంత దాఁటినన్. ౧౮

వ. పిమ్మట నాతండును నిశీథసమయమ్మున మదనవిధుర్ప్రేరితుండై యద్దాని గృహ
మ్మున కేతెంచుచు హఠాత్సంజనితకించిద్వివేకవశమ్మున. ౧౯

మ. ఘనరాజన్యశిరస్తటీమకుటసత్కారమ్ముచే మించు న
న్నునుఁ ద్రోచేపణఁ జేసి వ్యర్థముగ నెంతో పాప మార్జింప నీ
ఘననారీమణిచెంతఁ ద్రోచె, దిదియున్ ధర్మమ్ము గాఁ దోఁచెనే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! ౨౦

మ. చనవొప్పన్ జనపాలసేవకనమస్కారమ్ములం గొంచుఁ, ద
ద్ఘనసౌధమ్ముల ద్వారసీమలను నిత్యమ్ముం బ్రవర్తించు న
న్ననుఁ నిర్లజ్జునిఁజేసి వేశ్యగృహముల్ దూర్పంగ నీకొప్పునే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁగాపాడుమా! ౨౧

మ. ఇది దుష్కార్యమటంచు నాతఁడిటు లెంతే లోన నూహించుచుం
దుదకున్ గూఢముగాఁ దదీయగృహమున్ దుందుడ్కుమైఁజేరి, య
మ్మృదిరాక్షీఘనసుస్తనాగ్రపరిరంభప్రక్రియాభోగసం
పదచేఁ దానెవరో యెఱుంగఁ;డపుడుం బాండిత్యముల్ దోఁచునే! ౨౨

మ. అటులేగన్ మఱికొంతకాలము రహస్యప్రక్రియల్ దోఁప న
చ్చటి కీతండును నేగు, నిచ్చటికి నచ్చంచాగ్నిస్యయున్ వచ్చు. నె
ప్పటి కేప్రక్రియ వీలో యట్టులగుఁ; జెప్పన్ శక్యమే? దైవసం
ఘటనానైపుణి! యాతఁడయ్యదియొ? యక్కంజాక్షియే యాతఁడో? ౨౩

చ. మదిని విరక్తి దోఁచెనొ, సమంజస మీపని గా దటంచు బు
ద్ధి దిరిగి పోయెనో, మఱి పదింబది పెద్ద లొనర్చు నిందకుం
బెదరెనొ యేమొకాని, సరవిం దదనంతర మా లతాంగి కా
ర్తిదుఁ డయి యాతఁ డేగెఁ బరదేశ మొకానొకఁడా నెపమ్మునన్. ౨౪

క. శ్రీమంతము సతతహిమానీమంతము వర్జితతటినీ గాహనకే
ళీమంతము ప్రబలించెన్ హేమంతము విరహిజనులకే కుంతంబై. ౨౫

క. చలి వెట్టి యుష్ణరుచి కంబలకంచుకరాంకవాద్యపహృతుఁడై యి
ష్ముల మణుఁగఁబోలుఁ; గిరణమ్ముల పసలేకున్నఁ దగ్గిపోవునె? యెందున్. ౨౬

చ. పగలు కృశించె, రాత్రి విరవాయెఁ, గుబేరదిగంతరాగతా
శుగము జనాళి కాశుగము సొంపునఁ దోఁచె, ననంగవహ్ని హె
చ్చె, గిరివరమ్ము లన్నియు హసించె హిమాచలమున్, జలమ్ము పం
డ్లు గొఱుకసాఁగె, వృద్ధులు కడున్ భయమందిరి పాంథభామలున్. ౨౭

తే. గీ. అట్టి హేమంతమున నతఁ డన్యదేశ
వాసి యగుటకు నశ్వాలి వగలఁ బొగిలి
నూతనవియోగ మెంతయుఁ జేత మెరియఁ
జేయఁ దనయంతఁ దా నిటుచింతఁ జెందు: ౨౮

సీ. "గుబ్బలా యివి ? కావు! కుంభికుంభోరోజ! నాపూర్వజన్మపుణ్యములు గాని
అధరమా యిది ? కాదు మధురబింబఫలోష్ఠి ! రహించు నమృతపాత్రంబుగాని
కన్నులా యివి ? కావు కమలసన్నిభనేత్రి ! కళలనీనెడి ధేనుక లగుఁ గాని
వదనమా యిది ? కాదు వారిజారిసమాస్య ! నామనోరథనిధానంబు గాని

తే. గీ. బాలికవు నీవు గావహో ! నీలవేణి
లీల నూఁగెడి మరునిడోలికవు గాని"
అనుచు నుపరతవేళ న న్నాదరించు
వాని మేలెట్లు నే మఱవంగ నేర్తు ? ౨౯

చ. నిను విడనాడి నేఁటికి గణింపఁగ నొక్క నెలాయె నోయి! నీకె
గనుఁగొను నిచ్చఁ గన్నులును గాయలు గాచెఁగదోయి ! పేర్మి నె
మ్మనమున నెంచవోయి ? యనుమానము మానఁగదోయి ! నాపయిం
గనికర మంచవోయి ? కడకంటను జూడవు మోయి ! (మొక్కెదన్. ౩౦

క. అని చింతించుచు మధుసూదను మిత్రుం డొక్కఁడతని తావునకుం బో
వు నెసకమున్ విని యవ్వనజనయన తనవంత యతని సన్నిధిఁ జెప్పెన్. ౩౧

తే. గీ. మాటిమాటికిఁ జెప్పి యమ్మగువమిన్న
చింత గొనుటయు, నాతఁ డచ్చెలియ తమక
మెల్ల మధుసూదమనితోడ నెఱుఁగఁ జెప్పెఁ;
జెప్పినంతనె యాతని చిత్త మదరె. ౩౨

తే. గీ. ఇన్ని దినములనుండి యావన్నెలాఁడి
తోడఁ గ్రీడించు భాగ్యంబు గూడదయ్యె ;
సౌఖ్యములు పెట్టిపుట్టని సమయములను
సౌఖ్యములు గోర నేరికి సంభవించు ? ౩౩

ఉ. ముక్కర ముక్కునం గదిసి ముద్దులు గుల్క, బులాకి మోవిపై
చక్కి నటింప, లే నగవు చాయయుఁ లజ్జయుఁ గుమ్ములాడ నా
యక్కునఁ జేరి నాయనునయమ్ములకుం బ్రతిఁ జెప్ప కెక్కడా
మక్కువఁ గౌఁగిలించుకొను మత్సుకృతమ్మును జూచు టెన్నఁడో ? ౩౪

సీ. నాముద్దులమిటారి నావన్నెలకటారి నాపున్నెములకోవ నాదుచేవ
నావలపులదీవి నాయమృతపుబావి నాసొగసులతేట నాదుమాట

సాకోరికలయిక్క నానాశైములచుక్క నారసమ్ములసీమ నాదు ప్రేమ
నాకనుఁగవవిందు నా పెనుపగమందు నాకల్మి నాబల్మి నాదుచెల్మి

తే. గీ. నాదు రెండువప్రాణంబు నామనోధ
నంబు నాగుట్టు నామట్టు నాదుపట్టు
నన్ను విడనాడి యేగలి నున్న దొక్క
చెప్ప కేగె నటం చేమి చేసె నొక్కొ ! ౩౫

ఉ. 'నాతిరో ! లాతియూరికిని నాథుని నంపితి వా' యటన్న 'నే
నాతటి నూర' లే నని తనంతనె కన్నులనీరు జాఱఁగాఁ
గాతర వైఖి వంచుఁ జెలికాఁడు వచించెను ; నాదుకన్నులే
యాతమిఁ జూచెనేని మగువా ! యవి యెంత విచార మొందునో. ౩౬

చ. కర్మిమముగ మానసంబు కనుగందె నినుం గనుభాగ్య మబ్బమిన్,
దమకము హెచ్చె, మిన్నుపయి దాఁటినయట్టులఁ దోఁచె, నీదు చై
దములకు వాచెఁ గన్నులు, ముదంబు యథాయథలై నశించె, శ
క్యమయిన స్వప్నమందయినఁ గన్పడుమా ! యొకమాఱు నెచ్చెలీ ! ౩౭

సీ. చిఱునవ్వు మొగమందుఁ జెంగలింపఁగ సిగ్గుపడుట కైనను సిగ్గు వడెడిదాని
భక్తి విశ్వాససంపర్కమ్ముచే బయల్ పడెడి కించిత్ప్రేమభరముదాని
ఇటు చేయు మని చెప్ప నెట్టకేలకు సమ్మతించి తత్కృతి నాచరించుదాని
సురతమ్మునం దనాదరము గల్గియు నాదరమ్ము లే దని చెప్ప రాని దాని

తే. గీ. నుత్తరము చెప్పఁదగనట్టియుక్తులకును
మొగ మొకించుక వంచుక మురియుదాని
ముగుదయని మధ్యయని చెప్పఁదగనిదానిఁ
జూడఁదగుసోయగముదానిఁ జూడవలదె ! ౩౮

చ. గరువపుఁజెయ్యులా ? మెయినిగారములా ? కులుకారుతీరులా ?
పరువమునిగ్గులా ? వలపుభావములా ? రస మొల్కునల్కలా ?
మఱవని ప్రేమలా ? తలఁపు మర్మములా ? వెలలేని ముద్దులా ?
యఱునదిమందిరైన సరియా ? మఱి యాకరియానయానకున్. ౩౯

ఉ. బోటిరో ! నాఁడు నేలకులు పొల్పుగ నా కిడువేళ వ్రేలునీ
నీటగు గోట గీఁటె ; తది నేఁటికి నిన్ను స్మరింపఁ జేసెడిన్

మాటలు వేయునేల ? యొకమాట వచించెద నెంచి చూడఁగా
మాట లడంగుఁ గాని మఱి మచ్చలడంగునె ? మానినీమణీ ! ౮౦

చ. రతి యన నెట్టిదో యెఱుఁగరాని ననుం గని యాత్మశక్తిచే
నతివరో ! జారపూరుషులయందు మహాత్మునిఁ జేసినట్టి నీ
చతురత కేమనందుఁ ? గడుఁ జాణవు జాణవు జాణ ; వింత చి
న్నతనములోన నింతటి ఘనంబగు శక్తియుఁ గల్గియుండునే ? ౮౧

క. ఎన్నఁడు రతి నెఱుఁగనియా మున్నే మెఱుఁ గాయె, నింత మునిఁగె నెఱిఁగినం;
“దిన్నమ్మకుఁ దిన్నంతయుఁ గన్నమ్మకుఁ గన్నయంత” కాదె మృగాక్షీ ? ౮౨

చ. ‘వ్రతమును బాడుచేసి నను వంచనఁ జేసితి వెంతదానవే ?
యతివరో’ యన్నమాట కహహా ! యని నవ్వుచు ‘ముద్రవైచియుం
చితిరె ? బిగింపు మాట లిఁకఁ జెప్పకుఁ’ డంచు వచించునాఁటినీ
చతురత నేఁటికిన్ మదిని జల్లని వేళఁ దలంతుఁ గోమలీ. ౮౩

చ. అలదినమందు నాస్థలమునం దలకేళిగృహమ్మునందు నా
సలు దనివార నీసురతసౌఖ్యము దేలిననాఁట నుండియుం
గులసతి మోము గన్గొనుటకున్ మన సొగ్గదు ; “ఱంకు సాఁగఁ బెం
డిలి యిఁక నేల ” యంచును బఠించెడి పెద్దలనోరు క్రొవ్వనే ? ౮౪

ఉ. దూరమునంగునుండియును దొయ్యలి ! డగ్గఱ నున్న రీతిఁగాఁ
బీరముఁ జూపుచుంటి వది బేషు ! సెబాసు ! బళా ! యిదేమె ? యో
నీరజగంధి ! కంటి కొకనిద్దుర పట్టక మున్నె ప్రక్కలోఁ
దూఱెదు, కన్ను విచ్చినను దుఱ్ఱున దూఁటెద వెంత దానవో ? ౮౫

ఉ. అన్నుల మిన్న ! నిన్నుఁ గని యందురు కొందఱు మూర్ఖు “లెంతయుం
జిన్నెలు వన్నెలుం గలుగు చేడియ గా దిది” యంచు, దాన నీ
వన్నెల కేమి లోప ? మది వారలకన్నులలోప మెన్న, నా
కన్నులు వారు పెట్టుకొని కాంచిన నోరులు మూయకుందురే. ౮౬

ఉ. అన్నిటి కేమిగాని మగువా ! యొకటే నిజమైనమాట, నీ
చిన్ని మెఱుంగుఁజూపులును జిత్రపుఁ బల్కులు మొల్కనవ్వులుం
దిన్నని భక్తియుం దనివి దీఱని పేర్మియు నెంతతంద్రిలో
నున్నను నిన్ దలంపుటకు నోపిక నా కిడఁజాలెడుం జుమీ. ౮౭

చ. మమత దలిర్పఁగా నుపరిమన్మథ కేళిని గూడువేళ "నో
రమణిరో! నన్నుఁ గూడి యిటు అంతులు సేయఁగ నీకుఁ జెల్లెఁ గా
క మహిని దేని కా" ననినఁ "గాక మఱే, మిది నాదుపూర్వపు
ణ్య"మని వచించు నీదు వచనంబులు నామది నాట కుండునే? ౪౮

ఉ. రాపిడి గబ్బిగుబ్బల నురమ్మునఁ గ్రుమ్ముచుఁ గోర్కెఁ దేలుచుం
గోపము లేకయే కసరి కొట్టుచు "నొచ్చితి" వంచు వింతలం
జూపుచు ముద్దుపెట్టుచును సొంపుగ నన్నొరగ మెత్తి చూచు నీ
చూపుల కీయఁగా వలదె? సోలెడు పద్యము లంబుజాననా. ౪౯

చ. సముఖముఁజేరవచ్చి బిగిచన్నులఁగ్రుచ్చి కవుంగిలించి ప్రా
యముతమిఁజూపుచుం దమలపాకుల చిల్కలు నోటఁబెట్టుచుం
దమకముమీఱ నన్నుపరతమ్మున సోలఁగఁజేయునట్టి భ
ద్రముగల నాఁటిరోజు లిఁక రా విఁక రా విఁక రావు నెచ్చెలీ! ౫౦

చ. రకముగ నన్నుఁ గూడుటకు రాతిరివెన్నెలవేళ రాఁగ, మె
చ్చి కవుఁగిలించి "నీవెవరొ? చెప్పుము నాయికలం" దటన్నఁ, జె
ప్పక నగుఁబా టటంచుఁ బొరఁబాటున మెల్లనఁ "జంద్రికాభిసా
రిక" ననిపల్కు నీవచనరీతులు నామది నుండకుండునే. ౫౧

ఉ. 'పావనకీర్తి యీతఁ' డని పండితులెల్ల నుతించి కొల్వఁగా
భూవలయమ్మునన్ యశముఁ బొందుచు నుండెడి నాకు నయ్యయో!
నీవగలే సదామదిని నిల్పి భజించుట లబ్బె నెచ్చెలీ!
దైవము వ్రాయువ్రాఁత లవి తప్పవుగా భువి నెంతవారికిన్? ౫౨

చ. సొగసులదొంతిరైన యల సుందరిచెయ్వు లవెంత మూర్ఖుడుం
బొగడఁగ రాని వంచనఁడు; పున్నెము లేనిదినమ్ములన్ స్మృతిం
దగులఁగఁజేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవునుం
బొగిలిన నేమియా! మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా! ౫౩

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాలును నుండి యిప్డుగా
చేతమ! వచ్చితీ; విటులఁ జేసిన నిన్నిఁక నేమి నేసినం
బాతక మున్నదే! యిటుల భామల మాయలఁ జిక్కవచ్చునే! ౫౪

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూరు"నని సదా పలుకు నే నా బాలఁ గలయ నేల?
కలసిన, నేమి 'లోకులు విన్న మర్యాదలకు భంగ' మని భీతిలంగ నేల?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి నట డించి యిచ్చోటి కరుగ నేల?
అరిగిన నేమి, యాయంగన కొకనీటిబొట్టు డించక యిట్లు పొక్క నేల?

తే. గీ. గతజలమ్మున కీయాన కట్ట దేల?
యెట్టి నేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులనుఁ జెప్పవచ్చుఁ గాని
యాత్మకైనప్పు డాబుద్ధు లడుగుపట్టు. ౫౫

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామిని దిట్టినఁ దిట్టనిమ్ము, నిం
దలు గలుగంగనిమ్ము, తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయు టది కష్టము కష్టము కష్ట మక్కటా! ౫౬

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరుచు పెట్లొకో యనుచు నేను విచారణ నేయుచుండఁగా
నారమణీలలామ తనయంతనె తాఁ గరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; దాని విడ నేర్తునె? నేర్చిన దైవ మోర్చునే! ౫౭

క. అని యీగతి మోహాబ్ధిని మునిఁగి మనోరథరథమ్ముఁ బూని యతఁడు వే
గ నిజావాసముఁ జేరెను మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? ౫౮

వ. అట్లువచ్చినపిమ్మట ౫౯

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంబళిన్
మెక్కుచు వెండ్రుకల్ వెదుక మేకొనుచోఁ గలి వానె యేరికిన్! ౬౦

తే. గీ. రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగసంగ
తుల నొనర్పక మాన దీ తులువజాతి. ౬౧

వ. ఇట్లబ్బాల తనప్రవృత్తివైఖరిం బ్రవర్తింపుచుంటయు. ౬౨

క. ఎఱుఁగక యీతం డెప్పటికరణిన్ వర్తింపుచుండెఁ గామవశుండై
ధర గణికాంగన లొనరుచు దురుపాయములేరికైన దుర్జ్ఞేయంబుల్. ౬౩

వ. ఇట్లున్నంత. ౬౪

క. అమ్మధుసూదను కష్టసుఖమ్ములకు సమప్రసక్తి గలగుణవంతుం
డమ్మగువదైన వృత్తాంతమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. ౬౫

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
విసక తుద కాచరించె నవ్వేలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యయ్యతివమిన్న
కన్న గుణవతి' లేదంచుఁ గళవళించు. ౬౬

ఉ. 'అందమునందుఁ గాని మరియాదలపట్టునఁగాని నేమపుం
జందమునందుఁగాని నెలచానలలోనన కాదు, దీనికే
చందనగంధులున్ సవతు సల్పఁగ రా' రని యారుచుండు; రో
సుందరులం దగుల్కొనిన సోమరులన్ ఘుఱలింపశక్యమే? ౬౭

తే. గీ. అయిన నిద్దాని యవగుణం బతనిలోడఁ
జెప్పి విడఁదీతుఁ గాక యచ్చెలియ పొందు;
పత్నితో భర్త నెడఁబాపఁ బాప మండ్రు
కాని వెలయాలి నెడఁబాపఁ గలుషమనరు. ౬౮

వ. అని నిశ్చయించి యమ్మధుసూదను కడ కేతెంచి తత్కాలసముచితాలాపమ్ములం గాలమ్మగడపుచు నచ్చాల దుశ్శీలంబు సకృత్స్నంబుగాఁ జెప్పి యొప్పించి మఱియును ౬౯

ఉ. మాయలమారులైన వెలమానిను లెక్కడ! నేమపుంగతుల్
నాయకయుండు లెక్కడ! ప్రపంచమునం దెటువంటివారలున్
రోయక యుందురే! కడలుద్రొక్కిన దిట్టిలతాంగులైన దు
ర్జ్ఞేయము లీధనాంగనల చిత్తము లిందు భ్రమింప రత్తముల్. ౭౦

క. ఇంతకుమును మీతోడన్ మంతనమున జెప్పినట్టి మాటలలో నొ
క్కింతయు నయథార్థముగా కంతయు నిజమాయెఁగా యటంచుఁబలికినన్. ౭౧

క. ఆతఁడు సెప్పిన మాటలు చేతమ్మున కెక్క దాని చేష్టలయందుం
బ్రీతి సెడి తనదు ప్రతిన నిరాతంకముగా నొనర్ప నాత్మగతమునన్. ౭౨

మ. గొనముల్ సున్న, పలుకక్కి సత్య మహాహా! కూర్మల్ నభఃపుష్పముల్
మనముల్ సూడ శతావధానకృతులే, మానమ్ము కుండేటి కొ
మ్మని నీవెల్లనెఱింగి వారసలి నాహా! యెట్లు వాంఛించెదే!
మనమా! వద్దిఁక నాదుమాటవినుమా, మర్యాదఁ గాపాడుమా! ౭౩

మ. ' ధననారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ము గాఁజూడ నీ
ధననారీమణిమాత్రి మొక్కలె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని వర్జింపుటకూడ ' దంటి ; విపుడేనిన్ గూడునా , కూడదా ?
మనమా! వద్దిఁక నాదుమాటవినుమా! మర్యాదఁ గాపాడుమా. ౭౪

క. ఈగతి దృఢనిశ్చయుఁడై యాగరితకు వ్రాసె నిట్లు "లకటా! యశమున్
బోఁగొట్టికొంటి నీయనురాగము నిజమనితలంచి రమణీమణిరో. ౭౫

క. చెలికాఁ డాడిన పలుకులఁ గల యర్థం బెఱుఁగలేక కలికిరో! నీప
ల్కులె వేదము లని మురిసిన కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నే. ౭౬

ఉ. నిన్నననేల! నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ బే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
వన్నెయు వాసియున్ రుచిరవర్తనముం జెడఁగొట్టుకొంటి నా
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ డిఁక వేయునేటికిన్. ౭౭

చ. వలపు నిజంబటంచు మగువా! మది నమ్మితిఁ గాని యిన్ని మా
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గటా! సరివారలందు నా
దలయును వంచుకోవలసెఁ దన్వి? చరితంబు చెడెన్ సుఖమ్మునుం
గలుగకపోయె నిట్లగునుఁగా! వెలకాంతలతోడి కూటముల్. ౭౮

ఉ. ఓవనజాక్షి! నీదు కులయోగ్యత లెల్ల నెఱింగి నీపయిన్
భావము నిల్పి పండితులఁ బామరులుం గడుగేలిసేయఁగా
దే! విధిచోదితుండనయి తేలిక కేలికనైతి; నేరికిం
గేవల కాలకర్మగతికిం బ్రతికూలమొనర్పఁజెల్లునే! ౭౯

సీ. పుట్టినాఁడనుకదా! భువనప్రసిద్ధమౌ వైష్ణవకులమందు వనజనయన!
చదివినాఁడనుకదా! సకలవిద్యలను సజ్జనులెల్ల మెచ్చంగఁ జంద్రవదన!
తిరిగినాఁడనుకదా! పరదేశములను విద్యాప్రసంగములకై తలిరుఁబోఁడి!
పొందినాఁడనుకదా! భూమిలో నీపాటివాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి!

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటిదైనయొక్క-
కాంత కాసించుటే యొక కానిమాట ;
దానిలోన రసాభాసదశయుఁగూడఁ
గలిగెనేనియుఁ జెప్పనా! కలికి! సుఖము. ౨౦

క. ధన మీనో? మనమీనో? చనవీనో? నీదు జాతిచందము కాకు
న్నను నొకటి తక్కువున్నదె! పనిలేదిఁక నీగుణంబు బయటం బడియెన్. ౨౧

తే. గీ. కప్రపుంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి దోహదము చేసి
చొనిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే? యుల్లిగడ్డ. ౨౨

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు? నీకు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట కేమి,
జగతి కుపకారమగు చర్యసలిపితీవు. ౨౩

చ. వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
సొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే? ౨౪

తే. గీ. అనుచు నెఱుఁగంగనేర్చినయట్టివారి
కెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన!
యెఱుఁగనేరనియట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలాఁడె! ౨౫

క. నాకొక్కని కపకారము చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ!
లోకోపకారకంబగు నీకృతికిన్ మెచ్చవలదె! నేర్పరు లెందున్." ౨౬

క. అని కమ్మ వ్రాసి పిదపం దనయంతన విడిచె దానిఁ దగ నమ్మధుసూ
దనుఁడు; మనము విఱిగినచో వనితామణు లన్న గడ్డిపరకలు గారే? ౨౭

క. వాసవునకైన ధనకాంతాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణవ్యాసంగులు దానిబారిఁ బడ రెప్పట్లన్. ౨౮

మ. అతఁ డీరీతిఁ బరిత్యజించుటయు నయ్యబ్జాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి నెల్లవిటగోష్ఠిం జెంది పెంపొందె నా!
"గతిలేనమ్మకు గంజి పానక" మనంగా నిక్క మానే కదా! ౮౯

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొసంగుచుఁ దక్క లోటు జరుగకుండఁ డీరీతిఁ జక్కఁబెట్ట
ననుకూల మగుతీవిఁ దనకాంత తనకెంతయును పన్నె వాసి నార్జనము సేయ
నతిభక్తి గలశిష్యతతు లెల్లవేళలఁ దను గొల్చి బుద్ధిమత్తను భజింప
లక్ష్మీసరస్వతుల్ దమ పరస్పరవైరములవీడి తనగృహమ్మున వసింప

తే. గీ. బాంధవశ్రేణు లెల్ల సెబా సనంగ
సకలదిగ్దేశ రాజన్యసభలయందుఁ
దనయశమ్ము నిరంకుశత్వము వహింప
సుఖముగా నుండె నమ్మధుసూదనుండు. ౯౦

క. సతతపరిశ్రుతభూదైవతమృష్టాన్నప్రదానవర్ధితకీర్త్యం
చితతాదృశజనకయశోవితతీ! తతజగదతీతవితరణసుకృతీ. ౯౧

మ. పరిపూర్ణాయురపారభాగ్యవిలసద్భావాంచితా! కీర్తిసం
భరితాశాంతర! సత్కవిత్వకుకవిత్వస్ఫూర్తినిర్భేదత
త్త్వరహస్యప్రథమానబుద్ధిబలసంతానాధికా! నిత్యస
త్యరతా! చెల్మయమంత్రిపుత్ర! కవిరాడ్దారిద్ర్యవిచ్ఛేదకా! ౯౨

క. నానాఫలపుష్పాగనిదానోద్యానాంతరస్థితసుసౌధతలా
నూనబుధసుకవిమిత్రవితాన వినోదావధాన! దాననిదానా! ౯౩

గద్య.

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర
ప్రణీతం బయిన కేవలకల్పితంబగు శ్రవణా
నందంబను మహాప్రబంధమ్మునందు
సర్వంబును బంచమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

సంపూర్ణము

